# కవిగారి మనుగడ

జయంతి సుబ్బారావు

విశాఖపట్టణము.
ప్రకాశకులు:
కవిగారి షష్టిపూర్తి మహోత్సవ సంఘము.

*

# చిత్తరువులు

# వెలుగు పలుకు

మనలో చెప్పుకో తగిన మనవారి జీవిత చరిత్రలు లేవు. ఒక్క వీరేశలింగము గారిది మినహాయిస్తే అసలే లేవని చెప్పాలి. ఇంతవరకూ గురజాడ అప్పారావు, గిడుగు వేంకట రామమూర్తి, ఆనంద గజపతి, సాంఖ్యాయన శర్మ, లక్ష్మణరావు వంటి వారి చరిత్రలు మనము వ్రాసుకో లేక పోయాము. ఇట్టి లోపము తెనుగు సారస్వతములో కొంతవరకు తీరుస్తున్నది 'కవిగారి మనుగడ.'

బాస్వెల్లు జాన్సను చరిత్ర వ్రాసినట్లు మా సుబ్బారావుగారు కవిగారి మనుగడ వ్రాశారు. అనేక విషయాల్లో కవిగారిని జాన్సను కవితోనూ విషయ సంగ్రహాములో సుబ్బారావుగారిని బాస్వెల్లుతోనూ సరిపోల్చ వచ్చును.

కవిగారి 'ప్రియశిష్యుడు' గా, అనుయాయిగా ఉన్నారు సుబ్బారావుగారు. వారినే పిన్ననాటినుండీ ఆదర్శంగా పెట్టుకొని 'తిన్నని నడత' అలవరచుకున్నారు. నైష్ఠిక బ్రహ్మచారిగా, ఇపుడు కవిగారి తెనుగు గుడిలోనే

ఉండి ఆయనతో నిఘంటు పని చేస్తున్నారు. కవిగారు నడిపిన అనేకోద్యమములలో కలిసి పాల్గొన్నారు. ఇన్ని కలిగిన సుబ్బారావుగారు ఈ మనుగడ వ్రాయడముచేత పుస్తకానికి మరింత వన్నె కలుగు తున్నది.

సుబ్బారావుగా రన్నట్లు మనుగడలు-మనుచున్న వారివి వ్రాయడము చిక్కులలో చిక్కే, అయినా మనుచున్నవారివి వ్రాయడమువల్ల నిజ మేమాత్రమూ జారి పోవడానికి అవకాశ ముండదు. అనంతరం వ్రాయబడ్డ వాటిలో కొంత వర కయినా సత్యం మరుగు పడిపోక తీరదు.

సుబ్బారావుగా రెంతో శ్రమకు సహించి ఈ మనుగడ వ్రాశారు. రచన తెనుగుతనం నిలుపుకుంటూ చక్కగా సాగింది. తన భావన వీలయినంతవరకూ జిగి గల తెనుగు పదాలతో వెల్లడించ వలె ననే రచయిత ప్రయత్నము గ్రంథ మంతటా కనిపిస్తున్నది. ఇది ఒక విశేషమని చెప్పవచ్చు.

ఇది శ్రీ జయంతి రామమూర్తి గారికి అంకిత మైనది. మంచి పూవు మంచి దేవతకే చేరు తుంది. రామమూర్తి గారు కవిగారి వలెనే మంచి నడతకే ప్రాధాన్య మిచ్చిన వ్యక్తి. న్యాయ వాది పరీక్షయందు త్తీర్ణులైకూడ న్యాయమునకు చోటు చాలని ఆవృత్తిని

విసర్జించి ఉపాధ్యాయులుగా పని చేసిన వివేకి. కవి గారు రామ లీలోత్సవములు స్థాపించినట్లే రామమూర్తి గారు ఖాసింకోటలో కృష్ణ లీలోత్సవములు స్థాపించినారు. ఖాసింకోట, చోడవరం, పాలకొండలలో ప్రధానోపాధ్యాయులుగా పనిచేసి విద్యార్థులకు విద్యతో పాటు మంచి నడత నేర్పి, పలుకుబడి సంపాదించారు. విరోధు లొకసారి వీరిపై కేసుపెట్టి అరువది మందిచేత వ్యతిరేకముగా సాక్ష్యమిప్పించినా కూడ వీరి ప్రవర్తన ఎరిగి ఉండిన న్యాయాధికారి అదంతా అన్యాయ మని కేసు రద్దు చేసి, నిర్దోషి అని తీర్పు చెప్పినాడు. రామమూర్తిగారి శిష్యులే కొందరు కవిగారి శిష్యులుకూడను.

కవిగారూ, వారి మనగడ వ్రాసినవారూ, దానిని అంకితము గొన్నవారూ ఆదర్శాభిలాషులే కావడము చేత, ఈ పుస్తకము ఒక విశిష్టత్వము గడించుకొంటున్నది.

ఇక—కవిగారి మనుగడ పూర్తిగా చదివిన తరువాత, కవిగారు మనకు కేవలం కవిగా మాత్రమే కాక సంస్కర్తగా, కళానిష్ణాతగా, నాయకుడుగా, నియంతగా, భాషాతత్వ వేత్తగా కనిపిస్తారు. ప్రతీ విషయములోనూ ఆయన మనుగడ ఆదర్శనీయంగా

కనిపిస్తుంది. "మహానీయుల మనుగడలు మానవులను మంచి దారిని నడిపించును" అన్న సుబ్బారావుగారి వాక్యంతో పూర్తిగా ఏకీభవిస్తాము.

పురిపండా అప్పలస్వామి.





జయంతి సుబ్బారావు కృతికర్త.

సీ. అమల కౌశికగోత్ర మందుఁ జన్మించిన
పాపయ్యభట్టు మా వంశకర్త;
ఆయనకు ఇరువురాత్మజుల్ నరసింహ-
రామమూర్తులు; వారు రమ్యగుణులు;
ప్రథిత సద్గుణమణి భాసితుండగు రామ
మూర్తి * నిర్మలకీర్తి; పుణ్యమూర్తి;
గాఢవిద్యాకృషి కలితుఁడై ఆతఁడు
'మెట్రి' క్పరీక్షలో మించి నెగ్గి,
న్యాయవాది పరీక్షయందు తేఱియు, 'మాధ్య
మిక పాఠశాల'కున్ మేటి ఒజ్జ
గా నుండి, శిష్యుల గారాముతో చూచి,
గౌరవాదరములు గాంచినాఁడు;
గరిత లెల్లరు 'జే' యన ఘనత నొంది,
మగని కడుభక్తిఁ గొలిచిన మాన్యచరిత,
ప్రవిమలాత్మ కామమ్మ నాఁ బరఁగె; నేను
అట్టి దంపతులకు కడగొట్టు సుతుఁడ.

జయంతి సుబ్బారావు.

* జననము - ౩౦-౭-౧౮౭౪; మరణము - ౧౪-౯-౧౯౦౪.



శ్రీ జయంతి రామమూర్తి పంతులుగారు,
కృతిభర్త.

# అంకితము

ననుఁ గని పెంచిన నీకున్
మనుకువ మీఱ 'కవిగారి మనుగడ' యిడితిన్ ;
అనువగు గుఱుతుగ దీనిన్
కొనుచున్, దీవింపు మెపుడు కూరిమి తండ్రీ!

యువ : కార్తికము. సుబ్బారావు.



శ్రీ మామిడిపల్లి సూర్యనారాయణ
పంతులుగారు.

*

నా సహోదరి లచ్చమ్మ న్యాయశీల
పత్నియై తన్ను ఏవేళ భక్తిఁ గొలువ,
వఱలు మామిడిపల్లి సద్వంశభవుఁడు –
సూర్యనారాయణాఖ్యుండు – సుగుణమూర్తి;
ఇచ్చు నెడల, అతని చేతి కెముక లేదు;
నేఁడు 'కవిగారి మనుగడ' నాడె మనుచు,
అచ్చు వేయించి ధన్యత నందినాఁడు;
ఎల్లఁ డోముత! అతని సంఫుల్ల మతిని.

సుబ్బారావు.

# మనవిమాట

కవిగారి మనుగడ వ్రాయవలెనని, మొదట నా నెయ్యురు – సబ్మీసు సత్యకేశవరావుగారును, పురి పండా అప్పలస్వామిగారును తలంచిరి. నాకును అట్టి తలంపే కలిగెను. నా కడంక ఎఱింగింప – 'వల్లే' యని, వారు నాకు వీలు కలిగించిరి; పెక్కు సలహాలిచ్చి సాయపడిరి. పొత్తములు వ్రాయుటకు నాకు ఇదే మొదలు. మనుగడలు – అందులో మనుచున్నవారివి – వ్రాయఁబూనుట చిక్కులలో చిక్కు. కావున, నెఱవాదులు నా వ్రాఁతలోటులు మన్నించి, ఇందలి తేటులే తలకొందురు గాక!

ఇది అచ్చు వేయించుటకు సొమ్ము సాయము చేసిన మా బావ – మామిడిపల్లి సూర్యనారాయణగారి మేలు ఎన్నఁటికిని మఱవఁ జాలను.

దీనికి 'వెలుఁగు పలుకు' వెలయించిన అప్పలస్వామిగారి కూరిమికి ఎల్లప్పుడును మేలు మఱవమిని చూపుచుందును.

ఇది వెలుఁగునకు తెచ్చిన 'షష్టిపూర్తి మహోత్సవసంఘము' వారికి నా మన్నన తెలుపుచున్నాను.

నవంబరు ౧౫-3౫. జయంతి సుబ్బారావు.

నీ తలంపేమొ! సర్వజ్ఞ! నే నెఱుంగ;
కాని, స్వర్గంబుఁ మోక్షంబుఁ గాంక్ష చేయు,
టరయ, స్వార్థపరత్వమే అగును; కాన,
పరులకై సదా ఇటుఁ పాటుపడనె తలఁతు.

మాలేపల్లి రామచంద్రశాస్త్రి.

# కవిగారి జాతక చక్రము

| | | |
|---|---|---|
| | రా | |
| శ | రాశి. | |
| ల<br>బు : శు | ర : కే | చం<br>కు : గు |

# కవిగారి మనుగడ



తెనుఁగు దేశ చరిత్రమందు పందొమ్మిదవ శతాబ్ది మఱప రానిది. అందు నాటి తల్లి తన పున్నెము పంట అనునటుల, పార్వతీశ్వర శాస్త్రి-సర్వమంగళ శాస్త్రి-పరవస్తురంగాచార్యులు-వీరేశలింగము-గురజాడ అప్పారావు - లక్ష్మణరావు - సాంఖ్యాయనశర్మ - రుద్రాభట్ల రామశాస్త్రి - ఆనందగజపతి-రాధాకృష్ణయ్య - గిడుగు వేంకటరామమూర్తి - చింతామణి మొదలగు కన్నాకు బిడ్డలను ఎందఱనో కననోచుకొన్నది; వారివలన వాసి కెచ్చుకొన్నది. అట్టి వారిలో ఈ మనుగడకు ఒడయలగు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు ఒకరు.

వీరు పుట్టిన పట్టు కనకవల్లి అగ్రహారము; (కృష్ణా జిల్లా-గన్నవరము తాలూకా.) పుట్టిన నాఁడు భావ సంవత్సరాశ్వయుజ బహుళ దశమి; వీరిది వెలనాటి శాఖ; కౌండిన్యస గోత్రము; తల్లి దండ్రులు-కనకదుర్గా శ్రీరాములు; తాత ముత్తాతలు-రామస్వామి సుందర రామావధానులు. శాస్త్రిగారి పెద్దలు శ్రోత్రియులు; కర్మిష్ఠులు; వేదాధ్యయన సంపన్నులు.

వీరు తొలి చదువు తమ ఊరిలోను, చేరువ నున్న కుమ్మమూరిలోను, కొన్నాళ్ళు గొడవర్తిలోను చదివిరి.

పై చదువునకు కాకినాడ చేరిరి. తెలివి తేటలను బట్టి వీరికి ఇంగ్లీషు బడిలో జీత మీయ నక్కఱ లేకయే చదువుకొను వెరవేర్పడినది. చదువు చెప్పియు, పోలవరము జమీందారుగారివద్ద తాటాకు పొత్తము లెత్తి కాగితముల మీఁద వ్రాసియు, వెచ్చములకొఱకు సొమ్ము గడించుకొనుచుండిరి. చిన్నతనమున నైనను తండ్రిగారిని కూడ డబ్బడుగుటకు వీరి మది ఇయ్యకొన దయ్యె. ఎవరికిని ఎట్టి ఇబ్బందియు కలిగింపరాదనియే అప్పటి నుండియు వీరి తలంపు.

అదృష్టవశమున బాల్యమునందే వీరికి సత్సహవాసమును, పెద్దల సేవయును లభించినవి; దురభ్యాసములు చెంత చేరలేదు. తరగతిలో తఱచుగ మొదటి స్థానములనే ఆక్రమించుచుండిరి. బడిలోని చదువే కాక విడిగా కూడ తెనుఁగు పొత్తములను చదువుచుండిరి; ఛందస్సు నేర్చుకొన్న నాఁటినుండియు కవిత్వమునందు అభిలాష నెలకొనినది.

### విశాఖపట్టణము చేరుట

కాకినాడలోని కీ. శే. కొమ్మిరెడ్డి నరసింగరావు నాయఁడుగారు తమ రెండవ కుమారుని విశాఖపట్టణములో చదివింపనెంచి మన శాస్త్రిగారిని కూడ వెళ్ళఁ గోరిరి. అప్పటికి రైలు పడుట ముగియలేదు. ౧౮౯3 ఫిబ్రవరిలో భాస్కర రామమూర్తిగారితో కలసి వీరు పొగఓడమీఁద విశాఖపట్టణమునకు వచ్చిరి. మూర్తి

గారు కలాశాలలో ప్రవేశించుట జరుగ లేదు; కాని వీరు మాత్రము విశాఖపట్టణముననే ఉండిపోయి, కలాశాలలో ప్రవేశించిరి. ఆరుట్లవారి మేడలు వీరికి ఉనికి పట్లు.

అపుడు స్వాతంత్ర్య వాయువులు వీవఁ దొడఁగి, దేశీయులను మేల్కొలుపుచుండెను. దాదాభాయి, తిలకు మున్నగు నాయకులు కాంగ్రెసు సందేశమును వినిపించుచు, స్వాతంత్ర్యబీజములను వెద చల్లుచుండిరి. అవి ఎలజవ్వనపు నెత్తు రుప్పొంగుచున్న శాస్త్రిగారి నిర్మల హృదయక్షేత్రమందు నాటుకొని మహావృక్షములై ఎట్లు ఫలవంతము లైనవో తరువాత వీరుచేసిన దేశ సేవను బట్టి చదువరులకు తెలియ వచ్చును.

దేశీయమహాజనసభా నివేదిక ఒకటి శాస్త్రిగారు ౧౮౯౩-వ సంవత్సరమున చదువుటతటస్థించినది. ఆనివేదిక వీరి జీవితమునం దొక మహత్తరమయిన పరివర్తనము కలిగించినది. 'నాదేశము-నాభాష' అను భావములు దృఢపడి, పాదుకొన్నవి. అంతవఱకును ఉండిన "పెద్దచదువు చదివి ఉన్నతోద్యోగము సంపాదింపవలె" నను భావము నశించినది. దేశమాత పాదపీఠమున అసువుల నివేదింపవలె నను దృఢ సంకల్ప ముదయించినది; బానిస కొలువుకై పట్టభద్రు లగుట హీనమని తోఁచినది. కాని ఇంగ్లీషులోఁ గల ఉత్తమజ్ఞానమును సంపాదించుటకు కొంతవఱకైనను చదువుట మంచిదని

ఎంచి, ప్రవేశ పరీక్షలో నెగ్గి, ఎఫ్. ఏ. తరగతిలో ఆఱు నెలలు చదివి, బడి చదువు వదలివేసిరి.

కవి బిరుదు

శాస్త్రిగారికి కాకినాడలోనే కవిత్వమం దభిలాష మెందు కొనినదని తెలిపియుంటిమికదా! వీరు విద్యార్థిగ నుండినపుడొకసారి హిందూ కలాశాలా వార్షికోత్సవము జరిగినది. అప్పటికి మన శాస్త్రిగారికి చక్కని కవిత్వ ధారయు, మంచి శైలియు అలవడి యున్నవి. ఆ వార్షి కోత్సవమున కొన్ని పద్యములు వ్రాసి, శాస్త్రిగారు చదివిరి.* అవి సభ్యులు సెబాసనిరి. అప్పటి ప్రిన్సిపాలు

---

* సీ. హరిపుత్ర హరిపుత్ర హరిపుత్రులను మీఱి
సౌందర్య సరస వాక్సంపదలను,
గోపాల గోపాల గోపాలురను గెల్చి
భరణ నిర్మితి భోగ భాగ్యములను,
హరిపుత్ర హరిపుత్ర హరిపుత్రుల జయించి
ధర్మ కౌశల బల ధర్మములను,
గోపాల గోపాల గోపాలురను మించి
శేముషీ రాజ్య విశేషములను,
గీ. ఇందు మందార శిబి కర్ణ కంద కంధి
సురమణి దధీచులను దానశోభయందు
మించి, ధర్మంబు గనుచు పాలించెదొర!
శ్రీద మతి సాంద్ర! 'వుల్ఫమరే' కరేంద్ర!
చ. ఖచర ఘనాఘనాసురప కంధిభవామర భూరుహంబు లా
విచికిలగాత్రి భూమిసతి వేఁడుచు జీవనమున్, ధరిత్రి, స
ద్రుచులును, భూషణావళియు, రోయిగ నిచ్చిన, వారి మెచ్చ, కే
రిచి నిను నెంచి కొంచక వరించెను ''వుల్ఫమరే'' మరున్నిభా!

పి. టి. శ్రీనివాస అయ్యంగారు శాస్త్రిగారి కవితాశక్తికి మెచ్చుకొని, 'కవి' అను బిరుదముతో సంబోధించి, దీవించిరి. అప్పటి నుండియు శాస్త్రిగారి పేరు 'కవిగారు' అనియే వాడుకలోనికి వచ్చినది. జనసామాన్యమునకు కవిగా రననే తెలియునుగాని పూర్తి పేరు చెప్పిన తెలియదు.

## ప్రభుత్వోద్యోగము

బడిచదువు చాలించిన పిదప కవిగారికి దొరతనపు పనులెట్టుల జరుగుచుండునో పరికింపవలయునను అభిలాష కలిగినది. బయపునేని జోగయ్య నాయఁడుగారి స్నేహము వలన లభించిన మునసబు కోర్టులోని ఒక తాత్కాలికోద్యోగము ఆఱు నెలలు చేసిరి. అపుడు మఱొక ఖాయపుటుద్యోగము లభించినను, ఆర్డరు కాగితల సైతము అందుకొనకయే, అనుకొన్న ఆఱు నెలలు గడువును పూర్తి అయిన వెంటనే రాజీనామా యిచ్చివేసిరి. ఇదియే దొరతనమునకు సాయ పడమిని వెల్లడింపకయే వెల్లడించిన తొలి కమ్మ.

## శ్రీ కళాభిలాషక సమాజము

కవిగారి మిత్రులలో ఒకరగు సెట్టి లక్ష్మీనరసింహముగారు, నాటకములు ప్రదర్శింపవలయునను వేడుక కలిగి, ౧౮౯౫ డిసెంబరులో కవిగారినికూడ అందు పాల్గొనవలయునని కోరిరి. వీరు దాని కియ్యకొని, తమ

జట్టునకు ' శ్రీ కలాభిలాషక నాటకసమాజము ' అని పేరు పెట్టిరి. ఆ యేఁడు వేణీసంహారము ప్రదర్శించిరి.

విశాఖపట్టణములో అప్పటికి నెలకొని యుండిన ' శ్రీ జగన్మిత్ర సమాజమువారు ' పోటీకి తలపడిరి. అందువలన వీరి సమాజమువారు తమ ప్రదర్శనములు మఱింత వన్నె కెక్కునటుల కృషిచేసి, ప్రేక్షకుల మెప్పు పొందఁ గడంగిరి. ౧౮౯౬ లో రెండు నాటకము లాడిరి.

ఇట్లు సమాజము సాగుచుండినను, దానియందు బహునాయకత్వ మొక లోపముగ నుండెను. అందుచే కవిగారు ౧౮౯౭ లో తగు నిబంధనల నేర్పఱచి, పూర్ణాధికారమును తామే వహించి, దానిని నడిపింప సాగిరి. నాటకముల వలన వచ్చు సొమ్ము బీద పిల్లలకు విద్యాదానము చేయుటకును, ప్రజోపయోగ కార్యములకు వినియోగించుటకును, నిశ్చయించుకొనిరి. మఱియు జనసామాన్యమున జ్ఞానాభివృద్ధి కలుగఁ జేయుటకు, నాటక ప్రదర్శనములు మంచి సాధనములను తలంపుతో వీరు తమ శక్తినంతను వినియోగించి, తమ ఆశయముల కనుగుణముగ నాటకములు వ్రాసిరి. సమాజ సభ్యుల నాటకములనే ఆడవలయునను నియమము చేసిరి. దానిచే కవిగారును, సెట్టి లక్ష్మీనరసింహముగారును, ఆకెళ్ళ సత్యనారాయణగారును రచించిన నాటకములనే సమాజమువారు ప్రదర్శించుచుండిరి. అందు కవిగారి నాటకములే హెచ్చు.

వీరు నాటకములు వ్రాయుటయే గాక, నాటక ప్రదర్శనములందు స్వయముగ పాత్రధారణమొనర్చి, అభినయించుచుండిరి. సూత్రధారుఁడు, కృష్ణుఁడు, పాండురాజు, ధర్మరాజు, అర్జునుఁడు మొదలగు ప్రధాన పాత్రములను ధరించుచుండిరి ; 'బాల షేక్స్పియర్' అను పొగడికకు పాత్రులయిరి ; రంగస్థలమున, స్వతంత్రించి, శయ్యాగారము, భోజనము, దూర ప్రయాణము మొదలగునవి ప్రదర్శించిరి.

ఈ నాటక ప్రదర్శనములవలన విశాఖపట్టణములోని పిన్న పెద్దలకు కవిగారియెడల గౌరవాభిమానములు మెండుకొనఁ దొడఁగినవి. మిత్రవర్గ మధికము కాఁజొచ్చెను. నిరంతరము వీరి బసలోనికి అనేకులు వచ్చి, వివిధ విషయములంగూర్చి ప్రసంగములు జరిగించుచుండిరి. అట్టి సమావేశములకు అనువుగ నుండుటకై కవిగారు గోసాలమేడ దగ్గఱనున్న ఆరుట్ల రామదాసు నాయఁడుగారి గృహములోనికి బస మార్చుకొని, దానికి 'ధర్మాశ్రమము' అని పేరు పెట్టిరి.

ఇచ్చట నాటక సమాజ సభ్యులకు తగిన శిక్షణ మొసఁగి, వారిని నాట్యకళా కుశలులఁ గావించుచుండిరి. భాషాజ్ఞానము చాలని సభ్యులను, ఉచ్చారణము సరిగా రాని మహమ్మదీయాదులను కూడ నేర్పరులఁగాఁ జేయుచుండిరి. నటులను తయారు చేయుటయందు వీరు మంచి

శక్తి సామర్థ్యములుచూపిరి. ౧౮౯౭-౯౮ లలో మిషన్ స్కూలులో నాటకములాడిరి.

(శ్రీ) కలాభిలాషక నాటక సమాజ నటులఁ గూర్చి ఇట సంగ్రహముగ తెలుప నగు: సెట్టి లక్ష్మీనరసింహము గారు-ఈయన భీముఁడు, భీష్ముఁడు, సత్యవంతుఁడు, అర్జునుఁడు, దుర్యోధనుఁడు మున్నగు రాజ వేషములను ధరించుచుండిరి. రాచఠీవి కొఱవడకుండ చూపఁగల చక్కని నటుఁ డీయన. ఒకప్పుడు కుంతి, ఉలూచి పాత్రములను సైతము అభినయించిరి. చావలి వేంకట రమణ శర్మగారు-ఈయన సహజ హాస్యప్రియులు; తఱచుగా బ్రాహ్మణ పాత్రములను ధరించుచుండిరి. వీరి హాస్యరసము సున్నితము; గణింపఁ దగినది. భాగవతుల కృష్ణారావుగారు-ఈయనకు పద్యములు చదువుట పట్టు వడ లేదు-కాని విశ్వామిత్ర పాత్ర మభినయించుటలో ఆ నాఁడు ఈయనిది అంది వేసిన చేయి. తడకలూరి కుప్పుసామిగారు-చెన్నపురి నటుఁడు ; ఈయన హరిశ్చంద్రుఁడు, సత్యవంతుఁడు, కృష్ణుఁడు, విష్ణువర్ధనుఁడు, బిల్హణుఁడు మొదలగు పాత్రములు ధరించుచుండిరి; నాటకములలోని పాటలకు మట్టులు వేయుచుండిరి. అబ్దుల్ అజీజుసాహెబు గారు-భీముఁడు, పాండురాజు, ద్యుమత్సేనుఁడు మొదలగు పాత్రములు ధరించుచుండిరి. కడిమిసెట్టి వేంకట రమణయ్య సెట్టిగారు - కుసుమ సెట్టి, మదనాభిరాముఁడు, బొబ్బిలిపాటకుఁడు మొదలగునవియు, కవికొండల నర

సింహముగారు-విదూషకుఁడు మొదలగునవియు, అమీరు సింగుగారు - నారదుఁడు మొదలగునవియు; కొండూరి రామమూర్తిగారు-అర్జునుఁడు, సత్యవంతుఁడు, సారంగధరుఁడు మొదలగునవియు; జయంతి సూర్యనారాయణగారు - వశిష్ఠుఁడు, సుబుద్ధి, జయంతుఁడు మొదలగునవియు; ద్వారము వేంకట రెడ్డినాయుఁడుగారు యముఁడు, జయదేవు మొదలగునవియు; ఆమంచి రామమూర్తి, సీతారామయ్యగార్లు-హాస్య వేషములు మొదలగునవియు; మారేపల్లి సూర్యనారాయణగారు-లోహితాస్యుఁడు, ప్రద్యుమ్నుఁడు మొదలగునవియు; జల్లేపల్లి వీరభద్రస్వామిగారు-కన్యకాంబిక, సత్యభామ, సుభద్ర మొదలగునవియు; చిల్లా నారాయణస్వామిగారు-చంద్రమతి, సావిత్రి, యామినీపూర్ణతిలక మొదలగునవియు; పక్కి ప్రకాశముగారు-రత్నాంగి మొదలగునవియు; కట్టి సూర్యనారాయణగారు-చిత్రాంగి, భువనసుందరి మొదలగునవియు; శివకోటి అప్పలరాజుగారు-భానుమతి మొదలగునవియు, పాత్రములు ధరించుచుండిరి. ఎమ్. రత్నవేలు మొదలియారుగారు-కోఁదు, మేదరి, బారికె మొదలగు వేషములు వేయుచుండిరి. ఈయన జానపదులమాటల లోను, పాటలలోను ఆఱితేఱినవారు; నైపుణ్యముగల చిత్రకారులు; సమాజమునకు వలయు తెరలను తయారు చేయుచుండిరి. జయంత జయపాలములోని ఈయన మేదరి వేషము జన సామాన్యమును అత్యంతము ఆకర్షించిన

దని తెలుపుటకు నేఁటికిని ఉత్సవములలో పలువురు తీయు చుండు 'మేదరి-రాచకూఁతురు' వేషము లే తార్కాణ.

పైని తెలిపిన సభ్యులు ధరించు పాత్రముల విష యము పరికించితి మేని, ఇప్పటి పలువురు నాటక సమాజ నియంతలవలె ప్రధాన పాత్రము లన్నియు తామే ధరించి, ఇతరుల ప్రతిభ కనఁబడకుండఁ జేయు దురా చారమునకు కవిగా రేనాఁడును తావీయ లేదని గ్రహింపఁ గలము. అంతేకాదు; తమ సమాజమును ఉన్నత స్థితిలోనికి తెచ్చినపుడు, తాము పాత్ర ధారణమే మానుకొని, ఆయా వేషము లర్హులకే ఇచ్చుచుండిరి.

ఈ సమాజములో రాజ సభలయం దప్పుడప్పుడు నృత్యము చూపుచుండెడివారు. నటీ సూత్రధారుల సంభాషణము తొలుత జరిగించుచుండినను తరువాత విడిచి పెట్టిరి. ఇట్టి సంస్కారము తెచ్చిన వారిలో కవిగా రొకరు. అయినను దీనికి బదులుగా తా మాడు నాటకములోని నీతినిగూర్చి మొదటను, చివరను సవి స్తరముగ నుపన్యసించు చుండిరి.

అసూయాపరులు కొందఱు కవిగారి ప్రయత్న ములకు విఘ్నములు కలిగింప నెంచి, మిషను హైస్కూ లులో పురపాలక సంఘమువారి అనుమతి లేనిదే వీరు నాటకము లాడిరని ఆ సంఘమువారిచేత వీరి మీఁద 'కేసు' పెట్టించిరి. కాని మేజస్ట్రేటుగారు అందులకు స్థల మిచ్చినవారు బాధ్యులు కాని ఆడిన వారు కారని,

కేసు కొట్టివేసిరి. కేసు పెట్టినట్లు తెలిసిన వెంటనే ప్రత్యర్థులకు ప్రత్యుత్తరముగా ౧౮౯౮ లో కవిగారు కంసవధ నాటకమును ప్రదర్శించిరి. ఈ నాటకము లండను నుండి వచ్చిన లాజరస్సు దొరగారి గౌరవార్థమై గౌరవపు టిక్కెట్లతో ఆడిరి. ౧౮౯౯ లో కొమ్మిరెడ్డి వారి భవనమునను, ౧౯౦౦ లో హిందూ కాలేజీలోను, నాటకములు సాగెను. ౧౯౦౧ లో శ్రీ జగన్మిత్రసమాజమువారు వేసిన సాలలో ఒక నాటకము జరిగెను.

ఇటుల ఆరేండ్లు ఉత్సాహముతో సమాజము నడచినది. తరువాత సభ్యులలో-సెట్టి లక్ష్మీనరసింహ ప్రభృతులు శ్రీ జగన్మిత్ర సమాజములో చేరుట మంచి దని, అటు చేసిరి. కాని కవిగారు తమ సమాజపు బిడ్డ పేరు మాపుటకు ఇయ్యకొనరైరి. అందువలన కొన్ని దినములు ప్రదర్శనములు ఆఁగిపోయినవి. అయినను, క్రొత్త సభ్యులను కొందఱను చేర్చుకొని, క్రొత్త నాటకములు నేర్పి, క్రొత్త తెరలు వ్రాయించి, ౧౯౦౬ లో ధర్మాశ్రమముననే సొంత నాటకశాల కట్టించి, దానిలో అన్ని హంగులతోడను జనరంజకముగా మన కవి గారు నాటకము లాడించి, తమ సమాజమునకు పేరు తెప్పించిరి. అత్యుత్సాహముతో నాటకములు సాగుచుండెను.

ఇట్లుండఁగా నాటకశాల ప్రక్క నున్న ఆఁడు ఆసుపత్రి వైద్యురాలు, "నాటకము లాడుటవలన ఆసుపత్రి

రోగులకు అలజడి కలుగుచున్న" దను నెపము పెట్టి, ఎట్లయిన నాటకశాల అట నుండి ఎత్తివేయింపవలయు నని ప్రయత్నములు చేసెను. నిజమునకు నాటకముల వలన రోగులకు అలజడి కలుగకుండునట్లే కవిగారు శాల కట్టించిరి; కాన మ్యునిసిపలు చెయిరుమేనుగారిని తోడి తెచ్చి, నాటక ప్రదర్శనము జరిపించి, ఏమాత్రపు గంది కయు లేదని ఒప్పించి, ఆయనచే మరల అనుమతిపత్రము పుచ్చుకొనిరి. అయినను అప్పటి చెయిర్మేనుగారు ఏదో కారణమున తా మిచ్చిన అనుమతిని తామే రద్దు పఱ చిరి. దీనికి నిజమగు కారణము దూరదర్శిత్వము లేమియే. అందుచేత నాటకము లాడింప మఱియొకచోటు చూచు కొనవలసి వచ్చె; కవిగారి సత్సంకల్పమునకు ముప్పు వచ్చె; నాట్యకలాభివృద్ధికిని, జ్ఞానాభివృద్ధికిని అడ్డమయ్యె; సమాజమునకు ఎంతో నష్టమయ్యె. అయినను దానికి జంకి మిన్నకుండక, 'గుడిసెన గుళ్ళ' సాల అద్దెకు తీసి కొని, అచ్చట నాటకము లాడింప మొదలు పెట్టిరి. విజయ నగరములోను, రాజమహేంద్రవరములోను, అనకాపల్లిలోను కూడ నాటక ప్రదర్శనములు చేయిం చిరి; మెప్పు పొందిరి. అప్పటికి వారిజట్టులోని ముఖ్యులు కొందఱు చనిపోవుటచేతను, కొందఱు ఉద్యోగములకు వెడలి పోవుటచేతను, ౧౯౧౨ లో నాటకము లాడిం చుట మానివేసిరి. * (శ్రీ) కలాభిలాషక నాటకసమాజ

* ౧. కలాభిలాషక నాటకసమాజము గురించి పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రిగారు తమ 'ఆంధ్ర నట ప్రకాశిక' లో

శాఖగా బయలుదేఱిన 'హితకారిణీ సమాజము' రసపుత్ర విజయాది చారిత్రక నాటకముల నాడి పేరు గడించినది. దానికి ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు పెద్ద.

సంగీత మానినీ సమాజము

మానవ నాగరికతకు కళంకదాయకమగు పడుపువృత్తిని మాన్పించుటకు ప్రపంచ మంతటను ప్రయత్నములు జరుగుచున్నవి. వారికి జీవనాధారము కలిగించినఁ గాని ఈ దురాచారము కట్టువడదని తలఁచి, కవిగారు ౧౯౦౭ లో విశాఖపట్టణములోని వేశ్యాంగనలను చేర్చి, 'సంగీత మానినీ సమాజము' ను స్థాపించిరి. ఈ సమాజమునకు పెట్టుబడి పెట్టి, నాటకములాడ నేర్పించి,

---

ఇట్లు వ్రాసిరి. "ఇది మ. రా. రా. మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారిచేత స్థాపించ బడింది. మూడు భాషలలో వీరికి పాండిత్యం కుదిరింది. స్వయంగా నాటకాలు వ్రాస్తారు మంచివి. అప్పటికే వీరు జాతీయాల్ని వాడడం మొదలు పెట్టారు నాటకాల్లో. నాయక పాత్రలుకూడా ధరిస్తూ వుండేవారు. ఆకాలంలో వాడుగ్గా నాటకాల్లో కత్తిసామును చూపించేవారు. అందులో కూడా ఈయనకు చాలా ప్రఖ్యాతి ఉండేది. ఒకప్పుడు అర్జున వేషాన్ని బహు బాగా నటించారు. నటుల్ని తరిఫీగు చేయడంలో వీరంతవారు లేరని చాలా వాడుక. సెట్టి మాష్టరుగారు కూడా కొంతకాలం దీనిలో పనిచేశారు. ఆకెళ్ల సత్యనారాయణగారి నాటకాల్నికూడా వీరాడేవారు. తెరలూ, ఇంకా యితర దృశ్యాలూ ఎప్పటికప్పుడు సిద్ధం చెయ్యడానికి చిత్ర కళా ప్రవీణులైన ఎమ్. రత్నంగా రుండే వారు ఆ విషయంలోకూడ వీరు పార్శీ నాటకాల్ని మరిపించే వారట. నారాయణస్వామి నాయుడుగార నే

కలాకుశలత్వ మలవఱచిరి. ఈ సమాజమున కొన్ని పురుష వేషములుకూడ స్త్రీలే ధరించుచుండిరి. కలాభిలాషక సమాజమువారి నాటకములనే విశాఖపట్టణము, విజయనగరము, అనకాపల్లి, కాకినాడ, రాజమహేంద్రవరము, ఏలూరు, గుంటూరు, మచిలీపట్టణము మొదలగు చోట్ల ప్రదర్శించి పేరు గాంచిరి. ఈ యువతులకు కవిగారొసఁగిన శిక్షాక్రమము ఆదర్శనీయమైనది.

ఈ సమాజమున శ్రీమతి మద్దెల సూర్యనారాయణగారు—సత్యవంతుఁడు, కృష్ణుఁడు, అర్జునుఁడు, విక్రమార్కుఁడు, బిల్హణుఁడు, సత్యవతి మున్నగు వేషములును; శ్రీమతి కొంకిపూడి చిన చిట్టిగారు—చంద్రమతి, సావిత్రి,

---

వారు ప్రధాన స్త్రీ వేషాల్ని ధరించి మహా గొప్పగా నటించేవారు. వీరి కూడా రామచంద్ర శాస్త్రిగారి శిక్షవలననే అలాటి చాకచక్యం కలిగిందని చెప్పుకుంటూరు. వీరు ప్రదర్శించే నాటకాలన్నీ వీరి సమాజానికి చెందిన దేశికులచేత వ్రాయబడినవే. వీరి సమాజం తరఫున వాటి నన్నిటినీ ప్రచురించే వారు కూడాను. తరువాత ఇది జగన్మిత్ర సమాజంలో కలిసి పోయింది'' †

చూ. ౩౧౨, ౩౧౩.

† యజ్ఞనారాయణ శాస్త్రిగారిచట పొరపడిరి. శ్రీకళాభిలాషక సమాజము జగన్మిత్రలో కలిసి పోలేదు. రెండుసమాజముల పేర్లతో కొన్ని నాటకము లాడుట మాత్రము జరిగె. జ. సు.

౨. పురాణం సూరిశాస్త్రిగారు తమ 'ఆంధ్రనాటక సంస్కరణము'లో ఇట్లు వ్రాసిరి. ''మారేపల్లి రామచంద్ర శాస్త్రి, సెట్టి లక్ష్మీనరసింహంగార్లచే స్థాపింపబడినది. శాస్త్రిగారే నాయకపాత్రను ధరించుచుండిరి. వచనమును, వచన ప్రాయమగు

సత్యభామ, యామినీపూర్ణతిలక, సుభద్ర మున్నగు వేష ములును; శ్రీమతికొంకిపూడి పెద బుల్లిగారు-అశ్వపతి, మదనాభిరాముఁడు మున్నగు వేషములును; శ్రీమతి కొంకిపూడి చిన బుల్లిగారు-సూత్రధారుఁడు మొదలగు వేషములును ధరించుచుండిరి. ఇంకను మఱికొందఱు యువతులును నటించుచుండిరి. కుప్పుసామిగారిని ఈ సమాజమునకు కవిగారు పెద్దగా నియమించిరి. పదేండ్లు పాటు సంగీత మానినీసమాజము సాగినది. తామను కొన్న సంస్కరణము సాగింపమిచే, కవిగారీ సమాజపు పని మాన్పించిరి. నాటక సమాజములవలన వీరికి సుమారు 3000 రూపాయలు నష్టము కలిగెను.

---

కవిగారు నటుఁడు, నాటక కర్త, నాట్యాచార్యుఁ డు-అని చెప్పుట అతిశయోక్తి కాదు. తమ సమాజము

---

పద్యమును, అభినయమును, ప్రధానాంశములుగ నెంచుచుండిరి. నాటకశైలి సులభము. భాష పాత్రోచితము. శాస్త్రిగారు గొప్ప నాట్య శిక్షకులు. నాటక సభ్యులు వఁడంగము, కాసీకూలి పనుల తమకు తామే చేసుకుని కళాభిలాషక నాటకశాలను కట్టుకొనిరి. రత్నంగారు మహాద్భుతమైన సీనరీ తయారు చేసెను. నాటకము లందు పాత్రోచిత గ్రాంథిక భాషను విరివిగ నుపయోగించ దగునను సిద్ధాంతము, వచన నాటకముల నెక్కుడు రసవంతముగ నొనర్చి తేలిక శైలిలో ప్రేక్షక సుబోధకంబుగ రచించి ఆడవలె ననియు, సంగీతమును తగ్గించవలె ననియు, నిప్పుడిప్పుడు ప్రాకుచుండిన నాట్య సిద్ధాంతమును, యెంతోకాలము వెనుక నేమారేపల్లి రామ చంద్ర శాస్త్రిగారూహించి నడిపించుచుండిరి.

చూ. ౨౫ పుట

నకే కాక, సంగీత మానినీ సమాజమునకును, కొన్ని యెడల సురభి-జగన్మిత్ర సమాజములకును కూడ వీరు శిక్షణ మొసంగుచుండిరి.

ఉత్తమ నటు లున్నయెడల పాటలును, పద్యములును లేకుండ నాటకము లాడవచ్చు నని కవిగారు ఇంతకు ముందే, ముప్పది యేండ్ల క్రిందటనే తెలిసికొనిరి.

తమ సామాజకులలో పద్యములు చదువుటకును, పాటలు పాడుటకును శక్తి లేని నటులకు వీలగునటుల వచనమునే పెట్టి నాటకములు వ్రాయుచుండిరి. ఈ విధానమే మన నేటి నాటకరంగమున వాడుకలో ఉండు నెడల, "సంగీతము రానిచో నటుఁడు కాఁడు" అను దురవస్థ లేకుండెడిది. గొప్ప నటకులు పెక్కురు పైకి వచ్చుట కవకాశ ముండెడిది.

శ్రీ రాజా విక్రమదేవ వర్మగారి అధ్యక్షత క్రింద ౧౯౧౬ లో ఏర్పడిన 'విశాఖపట్టణాంధ్ర నాటక పరిషత్తు'నకు కవిగారు కార్యదర్శిగా నుండి శ్రీనాథుని వీధి నాటకమును గూర్చి మహజరు పెట్టించి, సభ చేసి పని చేసిరి.

౧౯౩౧ లో భమిడిపాటి చిన యజ్ఞనారాయణ శర్మగారును, పురిపండా అప్పలస్వామిగారును కార్యదర్శులుగా ఏర్పడి స్థాపించిన నాట్యకళాభిలాషుక సభకు అధ్యక్షులుగా ఎన్నుకొనఁబడిరి.

ఆసంవత్సరమే శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారి సమాదరణమున నెలకొనిన ఆంధ్ర నాటక కళా పరీక్షా సమితిలో కవిగారు సభ్యులుగా ఎన్నుకొనఁబడిరి.

## నీటి వైద్యము

ధన వ్యయము లేకుండ వైద్య సాహాయ్యము ప్రజలకు చేయఁ దలఁచి, ౧౯౯౭ లో కవిగారు 'జల చికిత్సా శాల'ను నెలకొల్పిరి. ఆ దినములలో ఏకుమళ్ళ నరసింహ మను విద్యార్థికి కుష్ఠ వ్యాధి కలుగుటచే పాఠశాలాధికారు లతనిని బడికి రాకుండ నిషేధించిరి. అతనికి గత్యంతరము లేకుండెను. కవిగా రతనికి సకలోపచారములును చేసి, జలచికిత్సవలన ఆరోగ్యము చాల వఱకు కలిగించి, అతనిని మరల బడిలో చేర్చుకొను స్థితికి తెచ్చిరి. విశాఖపట్టణమున అప్పటి వైద్యాలయములో బాగుకాని ఎన్నో జబ్బులను ఈ నీటివైద్యము చేత కుదుర్పఁ గలిగిరి. కాని ఈ చికిత్సాలయమునకు తగిన వసతి గృహము లభింపకపోవుటచేత కొన్నాళ్ళకు చికిత్సాశాల ఎత్తివేసి, రోగులు ఇంటి దగ్గఱనే చికిత్స జరుపుకొనుటకు తగు విధానమును తెలుపు చుండిరి.

రోగులకు సేవ చేయుటకు ముందడుగువేయుట కవిగారి స్వభావము. భయంకర రోగ పీడితులకు సైతము, భయముగాని–అసహ్యతగాని లేకుండ వీరు ఉపచారములు చేయుదురు. జొన్నవిత్తుల గురునాధముగారు తీవ్రమగు క్షయరోగముతో బాధపడుచు ధర్మాశ్రమము

నకు రాఁగా, ఆయనకు కొన్నాళ్ళు వలయు సదుపాయములును సకలోపచారములును చేసిరి. నేఁటికిని వ్యాధిగ్రస్తులగువారి కడకు, ఎన్నిపను లున్నను వెనుకపెట్టి, కవిగారు విచ్చేయుట కలదు.

ధర్మాశ్రమము

కవిగారి ఉనికి పట్టగు 'ధర్మాశ్రమము' ఏకాంత ప్రదేశము. నాటక శాల మొదలగునవి నిర్మించుటకు తగినంత విశాలమైనది. పెద్ద పెద్ద చెట్లును, రంగు టాకులు గల పలురకముల మొక్కలును, అల్లిబిల్లిగ నల్లుకొనిన పూఁదీవలును వెలయ అది కనుల పండువై ప్రశాంతముగ నుండును. పిల్లలు కూర్చుండుటకు చిన్న చిన్న వెదురు చాఁపలును, విడివిడిగా ముచ్చటించుకొను వారికి గిలాబా చేసిన మెఱుఁగు టఱుఁగులును, వేడుకలకు మెత్తని యిసుక నేలలును, వ్యాయామమున కనువగు ఎత్తుమట్టి పట్టులును అందు వెలయుచుండును. వేయేల? అది ఎల్లప్పుడును సీతారామ కోరుచుండెను. అక్కడకు పోవువారి మదికి హాయి చేకూఱును; సత్ప్రవర్తన మలవడును; ఉల్లపు పువ్వు విరియును.

నాఁటి నుండి నేఁటి వఱకును ఈ ధర్మాశ్రమము ఎన్నో ఉత్తమ సంస్థలకు కార్యాలయముగ వినియోగపడుచున్నది. ఎన్నో సమావేశము లిందు జరిగినవి.

జిల్లా జాతీయోపసంఘ కార్యాలయ మిందుండుటచే ౧౯౩౨ లో ప్రభుత్వమువారు ఆర్డినెన్సు క్రింద



ధర్మాశ్రమము.

ఇది నిషేధస్థలముగ తీర్మానించి, సుమారు రెండుసంవత్స రములు తమ స్వాధీన మందుంచుకొని సీళ్ళు వేసిరి. తిరిగి దీనిని కవిగారికి ఒప్పగించు నప్పటికి అందు పెక్కు గ్రంథములును, పరికరములును ధ్వంసమై యుండెను; ఇది చెదపుట్టలతోను, చచ్చిన పిల్లి-యెలుకల శల్యముల తోను, పాడువడి యుండెను.

ఇపుడును ధర్మాశ్రమము కవితా సమితి, కలాభి లాషక కావ్య మాలిక, ఆనందగజపతి గ్రంథాలయము మొదలగు సంస్థలకు కార్యాలయముగ నున్నది.

## ఉపాధ్యాయత్వము

దేశసేవకును, భాషాసేవకును తగిన వారిని తయారు చేయని దే ఆ ఉద్యమములు ఫలవంతములు కావని కవి గారు మొదటినుండియు భావించిరి. ఉపాధ్యాయులుగ నుండి, విద్యార్థులలో ప్రబోధము కలిగించి, నైతికముగ కూడ వారికి తగిన శిక్షణ మొసఁగి, దేశారాధకులను, భాషారాధకులను తయారు చేయవచ్చు నని ఎంచి యుండిరి. వారి తలంపునకు తగినటులే ఉపాధ్యాయ పదవి వారిని కోరి వచ్చినది. అంతకు ముందే ఒకసారి మిషను పాఠశాలా సహాయార్థము వీరి నాటకమాడించి నపుడు, ప్రిన్సిపాలు లాజరస్సు గారు తమ పాఠశాలలో కవిగారు ఒజ్జగా నుండిన బాగుండు నని ఊహించిరి. ౧౮౯౭ లో అందలి తెనుఁగు పండితుఁడు నెల సెలవు కోరఁగా, కవిగారిని కోరి-ఆస్థానమున నుంచిరి.

కవిగారు ఆ నెల దినములలో తమ బోధన నైపుణ్యమును చూపియుండిరి. దొరగారికి వీరియెడ అభిమాన మధిక మయ్యెను. అందుచే గడువు తీఱిన వెనుక కూడ ఉండి పొండని గౌరవ సూచకముగా కవి గారిని కోరిరి. కాని అది సాధ్యపడుట ఎట్లు? కవిగారు చిఱునగవుతో వచ్చి వేసిరి.

అంతట 'హిందూ కలాశాల' ప్రధానాచార్యులు, పీ. టీ. శ్రీనివాస అయ్యంగారు కవిగారికి కబురంపి, రెండవ ఫారమునకు వీరిని ఉపాధ్యాయునిగఁ గైకొనిరి.

పదను గల నేలయందు నాటిన విత్తనాలు బీఱువోక మొలక లెత్తి, పంటమొగమునకు వచ్చును. అట్లే విద్యార్థుల హృదయములందు నాటిన విజ్ఞాన బీజములు వారిని ఆదర్శ జీవనులను చేయఁ జాలును. అందువలన కవిగారు, విద్యార్థుల భావి జీవితమును సఫలముగ చేయు తలంపుతో, మంచి నడవడికను వారికి నేర్పుట కెంతేని శ్రమపడిరి. అయ్యంగారికి వీరి బోధనపద్ధతియు, నైతిక శిక్షణమును మిగుల సంతృప్తి గొలిపినవి. అప్పటి కాలేజీ తెనుఁగు పండితులకు ఆంగ్ల భాషా పరిచయము లేదు. అందువలన క్రొత్త పద్ధతులనుబట్టి వ్యాకరణము చెప్పుటకు వారికి వీలు కాకుండెను. నుడి కూర్పులోనే, నుడి తీర్పును బోధించుటకు, అయ్యంగారు కాలేజీ తరగతు లన్నియు కవిగారి చేతఁబెట్టిరి. అంతకు ముందు విద్యార్థులు తెనుఁగు పండితులను లక్ష్యపెట్టెడి

వారు కారు. ఇది అన్ని ఇంగ్లీషు బడులలోను పరిపాటి అయినది. కనుకనే మనవారిలో అనేకులు మాతృభాషా జ్ఞానశూన్యులై, ఆంగ్ల మానస పుత్రులైరి.

కవిగారు ప్రవేశించిన తరువాత కాలేజీలో ఆ విధానము మారిపోయినది. వీరి మొగము చూచు నప్పటికే పిల్లలు భయ భక్తులతో నక్కి పోవుచుండిరి. తుదకు ఇంగ్లీషు నైనను వెనుకఁ బెట్టి, తెనుఁగు పాఠములు చదువు స్థితి వచ్చినది.

విద్యార్థుల హృదయములు వికాసవంతము లగునటుల విషయముల బోధించుటయే కాక, ప్రశ్నముల మూలముననే సమాధానముల చెప్పించుచుండిరి. మొదట కొందఱు విద్యార్థులు పెంకెతనము చేయఁ జూచినను, కవిగారి కట్టుదిట్టములవలనను, ప్రవర్తన బలమువలనను తుదకు వారు దారిలోనికి రాఁ గలిగిరి. విచ్చలవిడితనమునకు అలవాటు పడియుండుటచే ప్రారంభమున వీరి కఠిన నియమములు విద్యార్థులకు దుర్భరము లని తోఁచినవి.

కొన్నాళ్ళకు అయ్యంగారు కలాశాలకు వసతిగృహము నేర్పఱచి, దానికి పెద్దగా కవిగారిని నియమించిరి. వీరు ఉత్సాహముతో అందుల కియ్యకొని, విద్యార్థులకు వలయు సౌకర్యము లన్నియు నేర్పఱచుచు, వారి నడతను దిద్దుచుండిరి. వీరి పాలనమున 'హాస్టలు' ఆదర్శప్రాయముగ నడచినది.

ఇట్లుండఁగా లాజరస్సు దొరగారు, కవిగారి నెట్టు లైనను తమ పాఠశాలకు రప్పించు కొనవలయు నని ఊహించుచుండిరి. అప్పటికి ఉండిన తెనుఁగు పండితునకు ఉపకార వేతన మిప్పించి వేసిరి. అధిక వేతన మిచ్చు పద్ధతి మీఁద తమ పాఠశాలకు రావలయు నని కవిగారికి కబు రంపిరి. ఈ ఉదంతమును అయ్యంగా రెఱిఁగి, కొంచె మోర్చిన తామే ఆ అధిక వేతన మిచ్చెద మనిరి. కాని ఎట్లీయఁగలరు? ఉన్న పండితుని తొలఁగించినఁ గాని వీరికి హెచ్చు జీత మిచ్చుటకు వీలు లేదు. తమ వలన ఆ పండితునకు నష్టము వచ్చుటకు కవిగా రంగీకరింపక, కాలేజీ కొలువు విడిచి, మిషను స్కూలులో ప్రవేశించిరి. విద్యార్థిబృందము వీరి వియోగమునకు వగచిరి. తమ బాళిని చూపుట కొక వీడ్కోలు సభను జరిపిరి; పద్య రత్నములు * కానుకగా నొసంగిరి.

---

* ఈ క్రిందివి అందలి కొన్ని పద్యములు :

ఉ. వచ్చియు రాని మాటలనె వందనముల్ ఘటియింతు భక్తిచే;
నిచ్చుట కేమి లేక నుతి నే నుపహారముగా నొసంగెదన్;
సచ్చరితుల్, జితేంద్రియులు, సాధిత కష్టులు, ధీయుతుల్ గదా!
అచ్చెరువైన వర్తనము నందఱు హా యన మార్గదర్శకుల్.

తరళ. శమ దమాధికు, సత్కళానిధి, శాస్త్రతత్త్వవిధాయకున్,
విమల వాక్య మనోహరున్, బుధవేద్య దివ్య ప్రవర్తనున్,
సమయ వాంఛిత కార్యయోచను, సజ్జనాళి హితాధిపున్,
కమల బంధు ప్రతాపశోభితు, గానవిద్య విశారదున్.

గీ. విడువ దుఃఖంబు పొఁగెడు వెల్లువ యయి,
కాని సంతోష పూరిత మానసులము;

పై విధముగ కవిగారు రెండవసారి ౧౯౦౧ లో మిషను హైస్కూలులో తెనుఁగు పండితులుగ ప్రవేశించిరి. వీరి రాక కొంతమంది చదువరులకు సంతసము గొలిపినను, కొందఱ గుండెలలో అాయి పడెను. వారి విచ్చలవిడితనమునకు వీరు పెద్ద ఆటంకము కదా!

విద్యార్థులు కిల్లీలు వేయ కూడదు; సిగరెట్లును, చుట్టలును కాల్చ రాదు; వట్టి మొగముతో నుండ

---

ఇంతకంటె నధిక ఫలవంతమైన
యొజ్జతనమున కేగుచునుండు కతన.

గీ. మున్ను పద్మనాభయ్యరు పోలికమరు
సరిగ వేళకు పాఠముల్ జరుపుటంగు;
'సోక్రటీసుకు' సాటియౌ సూక్ష్మ బుద్ధిఁ
ప్రశ్నలనె యుత్తరం బిచ్చు పాటవమున.

శా. ఏయే సద్గుణ జాలముల్ వినుదుమో యెందేని చిత్రంబుగా,
నాయా సద్గుణ జాలముల్ కనుదు మీ యార్య ప్రచారుంగనన్;
కాయక్లేశమునందు జోడు గలరే? కష్టాల వాలంబెకా;
మాయున్ చింతలు మోముఁ జూడమదిలో,మర్యాదలూహింపగా.

కవిరాజవిరాజితము.

జయమగుఁ గావుత సర్వ విధంబుల
శక్తి కొలందిగ చర్యలఁ జూపెడు ధీరునకున్;
జయమగుఁ గావుత చారు సుభాషణ
సత్య వ్రతాదర శాంతి సుఖాంబుధి చంద్రునకున్;
జయమగుఁ గావుత శారద సర్వర
సాంచిత సత్కృతి సంభరితాత్మ విచారునకున్;
జయమగుఁ గావుత సార్థక నామ వి
చక్షణ పండిత సంఘ వినోద ప్రవీణునకున్.

రాదు ; తలపాగాలకు తోఁక లుంచ రాదు—ఈ మొద లైన కవిగారి కట్టుఁబాట్లకు కొందఱు ఆఁగ లేక పోవు చుండిరి. పసిపిల్లలకు చేఁదువలె విద్యార్థులకు నైతిక శిక్షణ రుచింప కుండుట సహజము. వీరికి ప్రతీకారము చేయవలెనని కొందఱు దుడుకు బాలురు తలంచిరి. బడి లోనే తరగతి గదియం దుండునపుడు పైనుండి సప్ప చెముడు మట్టతో కొట్టవలయు నని అజ్ఞా పఱచుకొని, అటులే చేసిరి; దైవికముగ కవిగారికి అది తగుల లేదు. కాని పాప! మింకొక ఉపాధ్యాయునికి తగిలినది.

కవిగారు ఆ దుండగీంద్రను తెలిసికొని, సదుప దేశము చేసి, వారిని పశ్చాత్తాపపడునట్లు చేసిరి. వీరిని కొట్టుటకు తలపడిన ఆ కొంటెపిల్లలే తరువాత కవిగారి ఉన్నతాశయములను గ్రహించి, కలాభిలాషక సమాజ మున చేరి, స్వాయముగ శరీర క్లేశమున కోర్చి, నాటక శాలను కట్టిరి ; గోతులు త్రవ్విరి ; దూలములు మోసిరి ; రాటలను పాతిరి ; ఒక టేమి ? నాటక శాలకు వలయు చాకిరీ అంతయు వారే చేసిరి. అంత పెద్ద నాటక శాల నిర్మించుటకు పదమూఁడు రూపాయలు మాత్రము కూలి క్రింద వ్యయ మయినదని తెల్పిన, ఈ యువకులు ఎంత శ్రమపడిరో వేఱుగ చెప్ప నక్కఱ లేదు.

తమ సమాజములో చేరిన విద్యార్థుల జ్ఞానాభి వృద్ధికొఱకు ఉపన్యాస-సంవాద-దేహపారిశ్రామిక శాఖ లను ౧౯౦౩ లో ఏర్పాటు చేసిరి. యువకులచేత స్నేహ



ఒజ్జగా ఉండినప్పటి కవిగారు, ౧౯౦౬.

ము, ధర్మము, సత్యము, దేశసేవ, భాషాసేవ మొదలగు వానినిగూర్చి ఉపన్యాసము లిప్పించుచు, వ్రాయికలను వ్రాయించుచుండిరి. తరగతిలో వెనుకఁబడిన పిల్లలను ధర్మాశ్రమమునకు రప్పించి, ప్రత్యేక శ్రద్ధతో పాఠములు చెప్పుచుండిరి.

విద్యార్థులకు క్రమ శిక్ష నేర్పునెడ కవిగారు పైకి కాఠిన్యము చూపుచుండినను. వారి 'నిండు మనంబు నవ్య నవనీత సమానము.' విద్యార్థుల శ్రేయస్సుకొఱకే ఆ కాఠిన్యము చూపవలసి వచ్చె. అది మొదట కష్టముగ తోఁచినను, వీరిమది నెఱిఁగిన వెనుక వారు వీరి యెడల అనన్య సామాన్య గౌరవ ప్రపత్తులు కిలవారైరి.

ఈ గ్రంథము వ్రాయు సందర్భమున కొందఱతో ప్రస్తావించితిని. వారు కవిగారిని గూర్చి చెప్పిన సంగతులు ఆశ్చర్యము కలిగించినవి. నేఁడును ఆ బుద్ధిమంతులు కవిగారి దగ్గఱకు వచ్చుచు, తమ కృతజ్ఞతను తెల్పుచుందురు; ఆచార్యుని యెడ చూపవలసిన భక్తి విశ్వాసములు చూపుచుందురు.

## ఉద్యోగము మానుకొనుట

ఎట్టి పదవి యందున్నను, ఎంత మంచి ఆదర్శము లున్నను, బానిసకొలువు బానిస కొలువే. సామాన్యుల కది సామాన్యము కావచ్చును. స్వాతంత్ర్య ప్రియులకు అది దుర్భరమే. కొన్ని దినములు సక్రమముగ కడచి

నను, ఆటంకములు రాకపోవు; స్వతంత్ర జీవి తొలఁగి పోక తీఱదు. కవిగారి విషయమునను, అట్లే జరిగినది.

వీరు చేయుచున్నది కిరస్తానపు బడికొలువు. మిష నరీలు అన్య దేశములందు పాఠశాలల నెలకొల్పుటకుఁ గల అభిప్రాయములలో, వారిమత ప్రచారము ముఖ్య మైనది. ఎట్లయినను వీలయినంత మందిని తమ మత ములో కలుపు కొనుటయే వారి ఆశయము. కావుననే తుర్కీ నియంత–'కెమాలుపాషా' మిషను పాఠశాలలను లేకుండ చేయవలసి వచ్చెను.

మిషనుస్కూలు ప్రిన్సిపాలు–లాజరస్సు దొరగారు మాత్రము తమ మతములో కలియునట్లు బోధింపక, క్రీస్తు సుద్దులను కఱపుచుండినను, మిషనరీలు విద్యా ర్థులను కొందఱనైన క్రైస్తవ మతమున చేర్ప ప్రయ త్నించుచుండిరి. అట్టి ప్రయత్నములను కవిగారు నిరో ధింపఁగడంగిరి.

ఒకనాఁడు 'మెట్రికు' విద్యార్థి–అత్తివిల్లి సూర్య నారాయణగారిని తమ మతమున కలిపివేయుటకు కిర స్తానులు అన్ని యత్నములును చేసి యుంచిరి. అతని తోడి విద్యార్థులగు మద్ది పట్టాభిరామ రెడ్డిగారు మొద లగువా రీవిషయమును తెలిసికొని, అతనిని కవిగారి ధర్మాశ్రమమునకు తోడ్కొని వచ్చిరి. కవిగారు ఆయ నకు గీతాధర్మమును ఉపదేశించి, పెఱమతమున చేరుట

అనావశ్యక మని బోధించిరి. మిషనరీల ప్రయత్నములు వ్యర్థ మయ్యెను.

కవిగారి అడ్డంకి వలన తమ సంకల్పము నెఱవేఱుట లేదని వారు వెక్కసపడ సాగిరి. వీరి ఉద్యోగమునకు భంగము కలిగింపఁ బూనుకొని ఏదో నెపము కొఱకు చూచుచుండిరి. కవిగారును ఇది గ్రహించి, ఉద్యోగ మును వదలి వేయుటకు నిశ్చయించుకొనిరి. కాని నెయ్యూర పట్టువలన వెంటనే విడిచిపెట్టక, ఆఱు నెలల సెలవు కోరిరి. అప్పటికి వీరి వేతనము నెలకు నలువది రూపాయలు. సెలవు దినములలో పదునైదు రూపా యల చొప్పున నిచ్చెద మనియు, పిమ్మట వీరి కొలు వక్కఱ లేదనియు, తప్పని సరిగా మేనేజరు హోదాతో లాజరస్సుగారు మిషనరీల ప్రోద్బలమువలన వీరికి జవాబు పంపిరి. వెంటనే "మీడబ్బును అక్కఱలేదు; మీ కొలువును అక్కఱలేదు" అని ౧౯౧౩ మెయిలో రాజీనామా పంపి, కవిగారు ఆత్మ గౌరవము నిలువఁ బెట్టుకొనిరి.

కవిగారి యెడఁబాటు లాజరస్సు దొరగారికిని, విద్యార్థి బృందమునకును దుస్సహమయ్యె. విద్యార్థులు దొరగారి ఆధిపత్యమున వీడ్కోలు సభను జరిపి, సంతాపమును వెలిపుచ్చిరి. ప్రేమ చిహ్నముగను, గౌరవ సూచకముగను, ఒక స్వర్ణముద్రికను, పంచ

రత్నములను * సమర్పించిరి. ఆనాఁటి పీడ్కోలు

* పంచరత్నములు.

చ. ఎతని కజాండ మెల్ల సృజియింప భరింప హరింప లీలయో,
యెతఁ డజుఁడయ్యు లోకభరణేచ్ఛ జనించు విచిత్ర రూపియై,
యెతఁడు సమస్త కిల్బిషచయైకవినాశకుఁ; డట్టివాఁడు తా
సతతము రామచంద్ర కవిచంద్రుని కిచ్చుత నిష్టసిద్ధులన్.

శా. ఏరీతిన్ గొనియాడఁ బోలు నిట నే నేరీతి వర్ణింతు నీ
సారాచారుని శుద్ధమానసునిఁ, బ్రజ్ఞావంతు, సుశ్లోకునిన్,
ధీరస్వాంతునిఁ, గార్యశూరుని, జగద్గేయ ప్రభోదారునిన్,
మారేపల్లి కులాబ్ధిచంద్రు, బుధ సంభావ్య ప్రపూర్ణాత్మకున్.

సీ. ఘనకార్య నిర్వాహక ప్రజ్ఞ నెంతుమా,
మించిన యౌదార్య మెంచవలదె?
యౌదార్యమే యెంచ నానంచుఁ దలఁతుమా,
సాధుశీలత్వ మెంచంగ వలదె?
సాధుశీలత నెన్న సాగుచు నుంటిమా,
మలిన రాహిత్యంబు మఱతుమే మొ!
నిష్కల్మషత్వమే నెఱ నెంచుచుంటిమా,
యున్నతా దర్శంబు లెన్నఁ దరమె?

తే. గీ. నీదు వైరాగ్యచింతయు, నీగు దృఢత,
నీ సదుపకారబుద్ధియు, నీకె తగును;
ధరఁ 'బరోపకారార్థ మిదం శరీర'
మన్న సూక్తి చెల్లు గుణసంపన్న నీకె.

మ. వనభూమిం జిరకాలవాస మొనరింపన్ సంయముల్ దారుమున్
ఘనవైరాగ్యమనస్కులై ద్రవిణకాంతల్ మానఁగా,గల్గి; రై
నను, నీవో, కవివర్య! సంఘముననుండన్ నేర్చి, సంసారివై,
ఘన వైరాగ్యముఁ జెంది తౌర; జనకక్ష్మాపాలు చందంబునన్.

సీ. సత్యవాజ్నియతి ప్రశస్తకీర్తి చరిత్ర!
కైకొను నానమస్కార మిదిగొ;

దృశ్యము కరుణ జనకముగా నుండెను. కవిగారు నీతి నవరత్నములను * వారి కొసంగి, దీవించిరి.

---

పటుతర వాగ్ధూత చటుల ధూర్తనికాయ !
కైకొను నా నమస్కార మిదిగో;
సద్బోధనా శిష్యసంతోషిత స్వాంత !
కైకొను నా నమస్కార మిదిగో;
సద్గ్రంథ నిర్మాణ చాకచక్య ధురీణ !
కైకొను నా నమస్కార మిదిగో;
తే. గీ. సరసగుణ గణ ! నా నమస్కార మిదిగో;
సాధు జన బంధు ! నా నమస్కార మిదిగో;
సర్వజన మాన్య ! నా నమస్కార మిదిగో;
సాంద్ర సత్కీర్తి ! శ్రీ రామచంద్ర శాస్త్రి !

* నీతి నవరత్నములు.

గీ. శ్రీకరుండును, లోకేశ శేఖరుండు,
పరుఁడు మీ కాయు రారోగ్య వైభవములుఁ,
గ్రహణ ధారణ శక్తులుఁ కరుణ నొసఁగి
అరయుఁగావుత మిమ్ము విద్యార్థులార !.

గీ. మీరు విద్యార్థులగుటఁ అమితపు శ్రద్ధఁ
విద్య నేర్చుకో యత్నించి, విదితబుద్ధి
అంది, విద్యార్థి పదము మీయందు సార్థ
కముగ కావించి, సత్కీర్తి కాంచుఁడీరు.

గీ. విద్యతోడుత కనవలె వినయ; మట్టు
లగుటఁ వినయంబు గడియింప నగును మీరు;
దాని చేత గౌరవమును తప్పకుండ
అందఁ గలరు; నిజంబు విద్యార్థు లార !.

గీ. మీరు నావార లగుటను, మీ యెడలను
ఉన్న లోపములను చూపకున్న యెడల,

కవిగారి యెడ గౌరవానురాగములు హెచ్చుగా ఉన్న శిష్యగణములో ఎలమంచిలి నివాసులగు ఆకెళ్ళ సూర్యనారాయణగారొకరు; వీరు కార్యశూరులు; తమ గురువుగారు కొలువు మానివేసిన వార్త చెవిని బడఁగనే వచ్చి, పదునాలుగు ఎకరముల భూమిని వారికి సమర్పించిరి. ఈ భూమి ఎలమంచిలికి రెండు మైళ్ళ దూరములో నున్నది. అందు కవిగారు మంచి తోఁట వేయించిరి. ఈ తోఁటయే కవిగారు ఎలమంచిలిలో ఇప్పుడు నివసించుటకు కారణమైనది.

---

నేను మీ మేలు కనఁగుంట నిజము; కాన
తెలిపెదను; వాని విడి, మేలు పడయ వలయు.

సీ. చదువు మీఁదను తగు శ్రద్ధ లేకుండుట
ముఖ్యమౌ నట్టి మీ మొదటిలోప;
మయ్యవారల యెడ అర్హమౌ గౌరవం
బుండక పోవుట రెండవయది;
మీ బాధ్యత ఒకింత మీకు మనస్సున
నాటక ఉండుట నాలుగవది;
చెడు సహవాసముల్ చేయుచు, అందుచే
అన్నిటఁ చెడుచుంట అయిదవయది;

గీ. మంచిదని తెలిసినది సమంచితముగ
ఆచరింపక పోవుట ఆఱవయది;
ఇంక వీనిచే పుట్టిన వెన్నో కలవు;
అన్నియును వీడి, మేలొందుఁ డయ్యలార.!

గీ. చుట్ట సిగరెట్లు కాల్చుట, సొగసు కొఱకు
వెఱ్ఱి వేషముల్ వేయుట, విద్య మాని
పొల్లు మాటలఁ కాలము పుచ్చుట, మఱి

ఉద్యోగమును విడిచిన పిమ్మట కవులకు సాజమైన పేదఱికము కవిగారి యింట కాఁపురము పెట్టెను. మిత్రులు పలువురు ఏదేని కొలువులో ప్రవేశింపుఁడని బలవంత పెట్టుచుండిరి. శ్రీనివాస అయ్యంగారు కాలేజీ తెనుఁగు పండిత పదవిని స్వీకరింపుఁడని కబురంపుచుండిరి. కాని ఈ ధీరసింహము నియమభంగమున కియ్యకొన లేదు; సేవకావృత్తికి తల వంపలేదు.

## శ్రీ రామ లీలా మహోత్సవము

ఏదేశముగాని, ఏజాతిగాని తన పురాణ పురుషులను ఏమఱఁదగదు. వారి ఆదర్శ ప్రాయమయిన పవిత్ర జీవితమును గూర్చి తలపోయు చుండిననే గాని ఏజాతియు తన భావిచరిత్రము తేజోవంతముగ ఉంచుకొనలేదు. సాంఘి

---

పాడు కిల్లీలు నములుట, పరుల బాధ
పెట్టుట, చెడు జట్టుల గూడి పెంకెపనులు
ఆచరించుట విడుఁడు విద్యార్థులార !

సీ. ఏనాఁటి పాఠంబు లానాఁడు చక్కఁగా
నేరిచి బడి కరుదేరవలయు ;
ఒజ్జలు పాఠంబు లొగిఁ బోధ పర్చుచో
మనసు దాని పయినె ఉనుపవలయు ;
రానిది ఎల్లను క్రమముగా వెంటనే
వ్రాఁత పుస్తకముపై వ్రాయవలయు ;
వ్రాసిన దంతయు వదలక అవకాశ
మొదవరఁగనె చదువు కొనఁగవలయు ;
గీ. తల్లి దండ్రుల యెడ భక్తి తాల్పవలయు ;
ఒజ్జలను తగ మన్నించుచుండ వలయు ;

కముగ, రాజకీయముగ, నైతికముగ, మన మహాపురుషుల జీవితములు ప్రబోధ జనకములై ఉండును. ఈ మహోద్దేశముతో కవిగారు ౧౯౦౯ లో శ్రీరామ లీలా మహోత్సవమును విశాఖపట్టణమున నెలకొలిపిరి.

అప్పటికి విశాఖపట్టణమున పీర్గ పండుగలలో హిందువులు మునిఁగియుండిరి. అది కేవలము మహమ్మదీయుల పండుగు కాక హిందువుల పండుగయే అనునట్లు-మనవారందఱు అందు పాల్గొను చుండిరి. పెద్దపండుగకు వలె పీర్ల పండుగలలో హిందువులు తమ కుమార్తెలను, అల్లురను కూడ పిలుచు నాచార మేర్పడిన దనిన, ఆపండుగ ఎంత దిట్టముగ పాకుకొనినదో వ్రాయ నక్కఱ

బాలురకు సర్వదా సాయ పడఁగ వలయు;
ఎల్ల వారికి తోడుగా ఎసఁగ వలయు.

గీ. పొట్ట పోషించు కొనుట కిప్పుడు చదివెడు
చదువు కంటెను, ఒజ్జలు సదయులగుచు
ఇడు హితోప దేశములను హెచ్చు శ్రద్ధఁ
విని నడచుకొని, దాన మేల్ కనుఁడు మీరు.

గీ. పరుఁడు, మీ రిటుపయి బాగుపడి, పరులను
బాగు చేసి, దేశంబును బాగు చేయఁ
గలుగు శక్తి ఒసంగుచు కరుణఁ కాచు!
అనవరతమును మిమ్ము విద్యార్థులార!.

గీ. ఇట్లు మీ మేలు సర్వదా ఎదను కోరు
చొసఁగె ఈ నవరత్నము లొండు మేలు
చేయఁ జాలక పోవుటచేత ప్రీతిఁ,
సకల హితమతి, మా. రామచంద్రశాస్త్రి.



శ్రీ బొడ్డు రామయ్యసెట్టిగారు.

లేదు. చనిపోయిన పెద్దలకై ఏఁటేఁట చేసికొను 'ఏఁడుడి' యగు మహమ్మదీయుల పీర్ల పండుగలో, మనవారు తమ మతమును మఱచిపోయి పాల్గొనుచుండు టను చూచి, కవిగారు బాల్యము నుండియు జాలిపడు చుండిరి. ఆ ఆచారమును మాన్పించి, స్వధర్మమునం దభి లాష కలుగునట్లు చేయుటకు రామలీలా మహోత్సవము జరిగించుట అవసర మనియు-శ్రీరామ చరితమే అన్నిటి కిని తగి యున్నదనియు, వీరు నిశ్చయించిరి. కాని ఉత్సవ ములు జరుపుట అనిన మాటలతో సాగదుకదా! అయి నను సత్సంకల్పములకు సాయము రాకపోదు. ఒకనాఁడు పీర్ల పండుగ దినములలో దైవికముగా కవిగారి తలంపు తెలిసికొన్న శ్రీరాజా విక్రమ దేవవర్మగారు, తరువాత కొన్నాళ్ళకు, బొడ్డు రామయ్యసెట్టిగారితో కలసి వచ్చి, ఉత్సవమునకు వలయుసాయమంతయు చేసెదమని తెల్పిరి. వారి తోడ్పాటుతో కవిగారు శ్రీ రామ లీలోత్సవమును ప్రారంభించి, ప్రజలలో నూతన ప్రబోధమును కలిగించిరి. విశాఖపట్టణములో రామలీలా మహోత్సవము లనిన సాటిలేని వను పేరు వచ్చినది.

పీర్లపండుగ అప్పటికెంత ఆకర్షణీయముగ నుండెనో అంతకంటె ఈ ఉత్సవములు ఆకర్షవంతము లయ్యెను. కవి గారి ఆదిమందిరముతో పాటు పట్టణమున ప్రతి ముఖ్య వీధియందును మందిరములు స్థాపించునట్లు చేయ ప్రచారము జరిగినది. రామ లీలోత్సవములవలన పీర్ల

పండుగ సహజముగ తగ్గిపోవలసి వచ్చినది. అది సహింప లేని కొందఱు అల్లరి చేయుటకు నెట్టుకొనిరి. అందు వలన హిందూ మహమ్మదీయ కలహములు పొడమి-అల్లకల్లోల మగునేమోయని పట్టణములోనివారు భయ మొందు చుండిరి. కవిగారికి ప్రాణాపాయము కూడ వచ్చునేమోయని కొందఱు దిగులుపడు చుండిరి. కాని కవిగారు మాత్రము గట్టి పట్టుదలతో మహోత్సవము సాగించు చుండిరి.

ఒకసారి ఉత్సవముతో కవిగారు అల్లిపురమున కేగియుండిరి. సీతారామస్వామి కోవెల దగ్గఱ నున్న ఆదిమందిరములో సందడి లేకుండెను. అదియే సమయ మని-ప్రతి పక్షులు ఆదిమందిరమునకు చిచ్చు ముట్టించి, పాఱిపోయిరి. ఈ సంగతి కవిగారికి తెలిసినది. తెలియఁ గనే, ఏరికిని ముందుగ చెప్పకుండ, ఒంటరిగ అల్లిపురము నుండి ఆదిమందిరముకడకు బయలుదేరిరి. దారిలో వీరి ఉసుఱులు గొను తలంపుతో ఆ తుంటరులు కాచుకొని యుండిరి. కాని కవిగారిని చూడఁగనే కాలుసేతు లాడక వారు బొమ్మలవలె నిలిచిపోయిరి. ఈ సందర్భమున మహమ్మదు జీవితములోని ఘట్టము జ్ఞప్తికి వచ్చు చున్నది. ఆయన మక్కా నుండి మదీనాకు పాఱిపోవు చుండఁగా, దుర్మార్గుఁ డొకఁడు కత్తి ఎత్తి ఆయనను చంపఁబోయెను. కాని సమీపింపఁగనే చంపుటకు చేయి రాక వాఁడు వెనుదిరిగి పోయెను. కవిగారి యెడలను



శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారు

అట్లే జరిగినది. వీరు వచ్చి చూచునప్పటికి, ఆదిమంది రమునకు ప్రమాదము తప్పియుండెను.

అంతటితో పగవారు ఊరకుండక-వీలగు నప్పుడెల్ల కొంటెపనులు చేయుచుండినందున, అట్టి ప్రమాదములు రాకుండ-కవిగారు తమ ఆదిమందిరము దగ్గఱ సంగీత మానినీ సమాజములోని మహమ్మదీయ సభ్యు నొకని కావలి యుంచిరి. వీరి సత్సంకల్ప మెఱిఁగిన మహమ్మ దీయులును రామ లీలా మహోత్సవములందు పాల్గొను చుండిరి. విరోధులుగా మొదట పని చేసినవారును కొందఱు తుదకు ప్రసాదములడిగి పుచ్చుకొనఁ దొడఁగిరి.

కవిగారి సంకల్ప బల మెట్టిదియో కాని, నేఁటివఱ కును దివ్య వైభవముతో ఈ మహోత్సవము సాగు చున్నది. రాజా శ్రీ విక్రమ దేవవర్మ గారు ఈ మహోత్స వమునకు మొదటి నుండియు ప్రాపై హెచ్చుగ సాయము చేయుచు సుస్థిర కీర్తిని గడించుకొనుటయే కాక, శ్రీ రామానుగ్రహమునకు పాత్రులై, మహారాజ పదవి పొందఁ జాలిరి.

ఇది గాక బోధనాభ్యసన పాఠశాలా విద్యార్థుల గణపతి నవరాత్రోత్సవమునకు వెళ్ళి, కవిగారు ఉపన్యా సము లిచ్చుచుండెడివారు; హిందూపఠన మందిర పురాణ పఠన మతోపన్యాస సభలకు ప్రోత్సాహ మొసంగు చుండెడి వారు.

ఎలమంచిలిలో ఆకెళ్ళ సూర్యనారాయణగారు సప్తాహ-శ్రీరామ సామ్రాజ్య పట్టాభిషేక - రామ లింగేశ్వర ప్రతిష్ఠలు చేసినప్పుడు, వీరు అక్కడకు వెళ్ళి వానిలో పాల్గొనిరి. నరసీపట్టణము భక్తసమాజమువారు బలిఘట్ట క్షేత్రమున శ్రీరామ మహాసామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవము చేయించినపుడు, వీరు దానికి సాయపడిరి. ఈ నడుమ ఎలమించిలిలో స్థాపించిన శ్రీరామకోటి సమాజమునకు అధ్యక్షులుగా ఉండి, దాని పని సాగించుచున్నారు.

ఐందవ హితసభ

ఉద్యోగమును విరమించిన తరువాత కవిగారు ౧౯౧౩ లో 'ఐందవ హితసభ' నెలకొల్పిరి. ఇంగ్లీషున దీనిని 'ఇండియన్ మిషన్' అనివాడిరి.

"సత్యము పలుకవలెను; ఎవ రేపనులు చేయఁ బూనుకొనినను వా రాపనులు సరిగా చేయవలెను; మంచిగ్రంథములు చదువవలెను; మంచివారి సహవాసము చేయవలెను; ఎప్పుడును సత్యమును దాఁటకూడదు; ధర్మమును దాఁటకూడదు; శరీరమును కాపాడుకొనుటలో అజాగ్రత్తగా ఉండకూడదు; న్యాయముగా ధన మార్జించి జాగ్రత్త పెట్టుకొనవలెను; దేవకార్యములయందును, పితృ కార్యములయందును అశ్రద్ధ చూపరాదు; తల్లిని దైవముగా చూడవలెను. తండ్రిని దైవముగా చూడవలెను; అతిథిని దైవముగా చూడవలెను; నిందిం చుటకు వీలులేనిపనులు చేయవలెను; సదాచారములు అవలంబింపవలెను; పెద్దలను పూజింపవలెను; వారి బోధలు వినవలెను; వారి కిచ్చునది శ్రద్ధాభక్తులతో ప్రీతిపూర్వకముగా ఇయ్యవలెను; అశ్రద్ధతో ఇయ్యకూడదు; కర్మములందుఁగాని, ఆచారము లందుఁగాని

సందేహము కలిగిన యెడల, ఆయా పెద్ద లెట్లు నడతురో అట్లే నడువవలెను; సమస్త ప్రాణులను మనతో సమానముగా చూడవలెను; మన మేలునకై మనము ప్రయత్నించు నట్లే వాని మేలు కొఱకు ప్రయత్నింపవలెను; ఇట్లు లోకమును సేవించుటయే భగవంతుని సేవించుట. అందువల్ల నే శాశ్వతసుఖము-బ్రహ్మానందము కలుగును. అదే అన్ని జన్మములలో ఉత్తమమైన మనుష్య జన్మముయొక్క ప్రయోజనము. అంతియేకాని స్వర్గము, మోక్షము మొదలగు ఆముష్మిక సుఖములను గోరుచు చేయు కర్మములు స్వార్థ పరములు.''*

ఇవి ఈ సభకు ఆదర్శములు.

దీని పక్షమున 'హిందూ మిషనరీ' గా విశాఖపట్టణము చెఱసాలలో అప్పుడప్పుడు ౧౯౧౮ నుండి ౧౯౧౬ వఱకు మూఁడేండ్లు కవిగారు ఖయిదీలకు మతనీతిబోధ చేయుచుండిరి. దొరతనమువారును వీరిసేవకు మెచ్చుకొనిరి. అద్వైత మతమునందు వీరు గాఢాభిమానము చూపు చుండినను, పెఱ మతములయందు అసహనము చూపరు. ఆర్యసమాజ, బ్రహ్మసమాజ, దివ్యజ్ఞాన సమాజ సభలకు వెడలుటయు, కోరి నప్పుడు అధ్యక్షత వహించుటయు కలదు. 'తిన్నని నడత లేని దే ఎవఁడును మానవుఁడు కాఁజాలఁ' డని వీరి సిద్ధాంతము. వీరి మనుగడలో తిన్నని నడతకే ప్రాముఖ్యము ఎక్కువ. ఈ విషయమున కవిగారిని † 'కన్ ఫ్యూషియన్' తో సరిపోల్పఁ జూచుట సాహసము కాఁ జాలదు. తిన్నని

---

* మనుష్య జన్మము-దాని ప్రయోజనము-అను కరపత్రమునుండి.

† చీనా దేశపు తత్త్వ వేత్త.

నడతను గూర్చి ఈ ఐందవహిత సభాపక్షమున ప్రబోధము చేయుచుందురు. విశాఖపట్టణములోను, పొన్నూళ్ళలోను పెక్కు ఉపన్యాసము లిచ్చిరి. ఈ సభ పెట్టిన వెనుక చదువును గూర్చియు, మతమునుగూర్చియు, నీతిని గూర్చియు కవిగారు చేసిన పనులెల్ల దీని తోడివే అయియున్నవి.

౧౯౦౬ నుండియు ధర్మాశ్రమములో బికారి సంతర్పణములు చేయించుటయే కాక, అచ్చటను పై చోట్లను పై వారు చేయింపఁ గోరి నప్పుడు వీరు పెద్ద ఆికము పూని పని చేయుచుండిరి.

## విద్యాలయములు

తొల్లి భరతఖండము సమస్త విద్యలకు పుట్టినిల్లయి తన తెలివి కలిమిని జగమంతకును తెలియఁ చాటినది. కాని నానాఁటికి ఆ మింటి దివ్వె సన్నగిల్లి, క్రిందికి దిగి, అడుగంటినందులకు మనము సిగ్గుపడవలె. ఇప్పుడు ఏ దేశము వంక చూచినను చదువుకొనిన వారు ఎక్కువ; మన దేశములో చదువురాని వారు ఎక్కువ; స్థితిగతులు ఎటుల తల క్రిందులైనవో చూడుఁడు! పూర్వము మన దేశములో తక్షశిల, నలంద, అమరావతి, పుష్కలావతి మున్నగు విశ్వకళాపరిషత్తులు సమస్త విద్యలు నేర్పు ముఖ్య స్థానములై, వాసి గాంచుచుండె. అటువంటి దొరకటేని నేఁడు ఉన్నదని చెప్పుకొనుటకు వీలగునా? పేరునకు ఇప్పుడు విశ్వకళా

పరిషత్తులును, కళాశాలలును, ఉన్నత పాఠశాలలును, ఎన్నో నడచుచున్నవి. వీని వలన విద్యార్థులకు ఐహిక జ్ఞానము కాని, ఆధ్యాత్మిక జ్ఞానముకాని సరిగా అబ్బుచున్నదా? తుదకు బ్రతుకు తెరువునకు వలయు తెలివియైనను కలుగుచున్నదా? ఏదియు లేదు. ఇందు కొఱకే గద! తిలకు మహాశయుఁడు దేశములో జాతీయ విద్యాలయము లత్యావశ్యకములని ఘోషించెను.

మన కవిగారును ఈ విషయము విద్యార్థిగా నున్నప్పుడే గ్రహింపఁ గలిగిరి. వీరు విద్యాలయములో చదువుకొనుచున్నను, ప్రత్యేక కృషి చేసికొని జ్ఞానము సంపాదించుకొనిరి. తరువాత ఉపాధ్యాయులుగా పని చేసినప్పుడు, ఇప్పటి విద్యా విధానము నచ్చక 'ఈ బడులు బానిస బడులు; ఈ చదువులు చచ్చు చదువులు' అని వీరికి తేటపడినది. దీనిని బట్టియే ఒకసారి లాజరస్సు గారితో వీరు తాము ఒజ్జపని మానివేయునట్లు తెలిపిరి. కాని ఆయన 'తొందరవలదు' అని కోరుటచే అప్పటికి ఆఁగిరి. మతమును గుఱించి బడులలో చెప్పుట కవకాశము లేదు. కిరస్తానుల బడులలో మతమునుగూర్చి చెప్పుచున్నను, అది స్వార్థ పరత్వముతో కూడినదే. ఇప్పటి పద్ధతి ననుసరించి కళాశాల విద్యను పూర్తి చేసికొనివచ్చిన విద్యార్థికి ఏ వృత్తి నవలంబించుటకును శక్తి చాలకున్నది. బానిసకొలువే వానికి గతి. కనుకనే నేఁటి మేధావులు ఈ కళాశాలలను బానిసలను తయారు

చేయు కర్మాగారము లనుచున్నారు. మొన్న మొన్న నే 'బెర్నార్డుషా' పండితుఁడు జపాను విద్యార్థుల కొసంగిన సందేశములో, "నేఁటి విశ్వ విద్యాలయము లన్నియు ధ్వంసము చేసి, వాని గోరీపై నాకు నిలుచుండ వలయునని యున్న" దని నొక్కి వక్కాణించె.

కావున ఇట్టి లోటులను కొంతవఱకైన తీర్చుటకు దారి చూపవలయునని, కవిగారు కొన్ని పాఠ శాలలను స్థాపించిరి. మొట్టమొదట ౧౯౦౧ లో ధర్మాశ్రమ మందు కూలినాలి చేసికొని బ్రతుకువారికి వీలగునటుల, రాత్రి పాఠశాలను పెట్టి చదువు చెప్పుచుండిరి. ఈ బడి నుండియే, పీ. టీ. శ్రీనివాస అయ్యంగారు కాలేజీలో చిత్తరపు-తరగతి పెట్టినప్పుడు, దానికి కొందఱ పిల్లలను పంపి, తోడ్పడిరి. కలాభిలాషక సమాజ మందిరమున ౧౯౦౮ లో ఒక రాత్రి పాఠశాలను, ౧౯౧౨ లో నిమ్నజాతి పాఠశాలను ఏర్పాటు చేసిరి. విశాఖపట్టణ సహాయ వైద్యాధికారి - వి. సుందర రెడ్డిగారి హెచ్చరికపైని 'నిమ్న జాత్యుద్ధరణ సమాజము' నేర్పాటు చేసి, కార్యదర్శిగా నుండి సేవ చేసిరి. ఈ సమాజము పేర విశాఖపట్టణములోని యిసుక కొండ మీఁద స్థాపించిన పై పాఠశాలలో సోర్నపూడి రాజన్నగారిని ఉపాధ్యాయులుగా నియమించిరి. ఈయన కవిగారిదగ్గఱ శిక్షణపొంది, పిల్లలను అభివృద్ధిలోనికి తేఁగల సమర్థులైరి. ఇటుల కొన్నేండ్లు సాగిన పిమ్మట ఈ పాఠశాల

‘ మ్యూన్సిపాలిటీ ’ పెత్తనము క్రిందికి పోవలసి వచ్చెను. అయినను మొదటి మాదిరిగానే నేఁడును సాగుచున్నది.

ఒక రాత్రిపాఠశాలవలన జరుగు పనితో కవిగారికి తనివి కలుగక పోయెను. అందుచే విరివిగా జాతీయ విద్యను వ్యాపింపఁ జేయుటకు ఐందవ హితసభ పేరుతో ౧౯౧౪ లో ‘పగటిపాఠశాల’యు పెట్టిరి. పిదప ‘చెండిక వారి పాఠశాల’యు, ‘చట్టాల వారి పాఠశాల’యు తమ పెత్తనములోనికి వచ్చునట్లు చేసికొనిరి. ఆ పిమ్మట, అల్లిపురము నందు ౧౯౧౭ లో ‘సీతాబాలికా పాఠశాలయు, రాత్రి పాఠశాలయు’ నెలకొల్పిరి; ‘నిమ్నజాతి రాత్రి పాఠశాల’ నెలకొల్పిరి. ఈ బడులలోని పిల్లలకు ప్రవర్తన ముఖ్యము. కులవిద్యల కుపకరించు విజ్ఞానమును కలిగించుచుండిరి. ప్రార్థనయు-ధ్యానమును బడిలోనే అలవఱచు చుండిరి.

అప్పటికిని తనియక పెద్ద చదువు చదువుకొను వారలకు ౧౯౧౭ లో ధర్మాశ్రమమందు ‘ఆంధ్రకళాశాల’ పెట్టిరి. నేనును, నానేస్తము, కీ. శే. చిలుకూరి పూర్ణయ్యయును, మొదట ‘రాత్రి పాఠశాల’లో చదువుకొని, తరువాత ఈ కళాశాలలోనే చదువుకొనినాము. కొందఱు బి. ఏ. విద్యార్థులు కూడ అప్పుడప్పుడు వచ్చి చదువుకొనుచుండెడి వారు. ఐదవ తరగతి పరీక్షలో నెగ్గిన పిల్లవాండ్రు కొందఱు దీనిలో చదువుకొను చుండిరి. ఇందే తమచేతిక్రింది బడులలోని ఒజ్జలను కవి

గారు తర్ఫీతు చేయుచుండిరి. ఇది సదా తెలచియే యుండె డిది. చదువరుల అదను పదనులు కనిపెట్టి, కవిగారే చదువు చెప్పుచుండెడి వారు. ఇది గాక బ్రహ్మశ్రీ ప్రక్రియ అప్పన్న శాస్త్రిగారి సాయముతో 'వేదపాఠశాల'యు, బ్రహ్మశ్రీ చేవలి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి పెద్దఱిక మున 'ఆయుర్వేద కళాశాల'యు ౧౯౧౨ లో నెల కొల్పిరి. ముద్దా సోమప్పశాస్త్రిగారి పెత్తనము క్రింద, మేలుపాకలో ఒక పెద్ద పాఠశాలయు, ఎలమంచిలిలో ఒక పాఠశాలయు 'ఐందవ హితసభ' పెద్దఱికముననే పని చేసినవి.

బాలికలకే కాక యువతులకు కూడ విద్యనొసంగు టకు విశాఖపట్టణములోని 'జానికయ్యామ్మ పాఠశాల'లో ఏర్పాటు చేయించిరి. విశాఖపట్టణమందు 'క్వీన్ మేరీ హైస్కూలు' పెట్టినప్పుడు, దానివలన ఎంతో మేలు కలుగునని ఆసించి, ఇంటింటికి పోయి బాలికలను బడికి పంపుఁడని శ్రీ విక్రమదేవ వర్మగారును వీరును హెచ్చరిం చిరి. స్త్రీలు బాగుపడనిది దేశము బాగుపడదని కవిగారు తెలుపు చుందురు. విశాఖపట్టణ 'భారతీ సమాజము' వారికి కోరినసాయము చేయుచుండిరి. ఐందవ స్త్రీ విద్యా సంఘము స్థాపించి భూపతిరాజు వేంకటపతి రాజుగారు మొదలగు వారును, కవిగారును పని చేయుటకు ప్రయ త్నించిరి.

విద్యార్థులకు తెనుఁగునాటి ఆటలు-దుడ్డాట, ఉప్పన పట్టె, చాకిబాన, గిటీదొంగ మొదలగు వానియందు ఆసక్తి కలిగించి, వానిని పెంపొందించుటకు కవిగారు ౧౯౧౭ లో 'విశాఖపట్టణ వ్యాయామ క్రీడా సంఘము,' ప్రొఫెసర్-బులుసు రామ జోగా రావుగారి ప్రోత్సాహముచే, భూపతిరాజు వేంకటపతి రాజుగారు మొదలగు పెద్దల సాయమువలన, ఏర్పాటు చేయించిరి. ఈ జిల్లాలోని బడి పిల్లలకు ఆటల యందు పోటీలు పెట్టి, గెలుపొందిన వారికి 'భీష్మ విగ్రహము' ను కానుకగా ఏర్పఱచిరి. ఇది అలవు, తెగువ, మంచి నడతలకు గుర్తు.

మొట్ట మొదట విశాఖ పట్టణమున బాలభటులు ధర్మాశ్రమమున కవిగారి పెద్దఱికముననే తర్ఫీతు పొందిరి.

పై విద్యాలయముల పని అంతయు, ఐందవ హిత సభా పక్షముననే, కవిగారు చేయుచుండిరి.

### గ్రంథాలయములు

తెనుఁగునాట గ్రంథాల యోద్యమము బయలు దేరక ముందే కవిగారు గ్రంథాలయముల పని మొదలిడిరి. కాకినాడలో ౧౮౯౭ లో కొమ్మిరెడ్డివారి గృహస్థ గ్రంథాలయము చక్కఁబఱచుటయే వీరికి ఈ సేవలో విఘ్నేశ్వర పూజ. గ్రంథాలయములనిన, ఇప్పటి పలు గ్రంథాలయములవలె జూదము, చదరంగము, కేరమ్సు

మొదలగు వేడుకలతో ప్రొద్దుపుచ్చునవి కాక, ప్రజలలో యథార్థాభివృద్ధిని కలిగించునవిగా ఉండవలె నని కవి గారి తలంపు.

౧౯-౨౧ లో జరిగిన విశాఖపట్టణమండలగ్రంథాలయ ప్రత్యేక మహాసభకు అహ్వాన సంఘాధ్యక్షులుగ ఉండి, కవిగారు తమ స్వాగతోపన్యాసమున తెల్పిన ఈ క్రింది విషయములు పరికించితిమేని, వారి ఆశయములు తెల్లము కాఁగలవు :

"దేశస్థితినిబట్టి గ్రంథాలయములు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క విధముగా జ్ఞానాభివృద్ధి చేయవలసియుండును. గ్రంథాలయముల పరమావధి దేశాభివృద్ధిగాన ఎప్పుడెట్టి జ్ఞానమభివృద్ధిచేయుట మంచిదో కడు మెలఁకువతో నిర్ణయించుకొనవలెను. మునుపు సిరి కాటపట్టగు మనదేశ మిప్పుడు పెద్దమ్మ కాటపట్టుగా ఉన్నది. అందుచేత మన యిప్పటి నిప్పచ్చితనమును అవ్వలకు పుచ్చి, ఎల్లసిరులు సమకూర్చు జ్ఞాన మభివృద్ధి చేయుటకే గ్రంథాలయములు తమశక్తి అంతయు వినియోగింపవలెను. "బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చు" అను మాటనుబట్టి, బ్రతుకుఁ దెరువుగదా ముందు చూచుకొనవలె. కాఁబట్టి మన నిఱుపేదతనమునకు కారణ మేమో తెలుపు జ్ఞానము గ్రంథాలయము లిప్పుడు ప్రజలకు సమకూర్పవలయును. నూలు వడుకమి, బట్టలు నేయమి, దేశవాళీ రంగులు వేయమి, ఆముదము పైరు పెట్టమి మొదలగు తెలివి తక్కువ పనులవల్లను, కోర్టులకెక్కుట - విదేశ వస్తువులే హెచ్చుగా కొనుట, సిగరెట్లు, బీడీలు, టుప్పొ, గంజాయి మొదలగునవి కాల్చుట-కల్లు, సారాయి, కాఫీ, తేనీళ్ళు, సోడా, నిమ్మనీరు మొదలగునవి త్రాగుట-మెడపట్టీలు, టోపీలు, మేజోళ్ళు,

కోట్లు, కమీజులు మొదలగునవి వేసికొనుట - జూదమాడుట మొదలగు పనికిమాలిన పనులవల్లను, మన దేశమున కెంత నష్టము కలుగుచున్నదో, అవి మానిన ఎంత లాభము కలుగఁ గలదో, గ్రంథాలయోద్యమాభిలాషులు ప్రజలకు బోధింప వలయును. ఊళ్లు పరిశుభ్రముగా ఉంచుకొనుటవల్లను, పంచాయతీ కోర్టులు పెట్టుకొనుటవల్లను, నూలు వడుకుట మొదలగు వృత్తు లవలంబించుటవల్లను, ఎంత మేలు కలుగునో, విసుగు విరామములు లేక చాటుచుండవలెను.'' *

కవిగారు విశాఖపట్టణమునకు వచ్చిన తరువాత, ఆంధ్రదేశములోని మొట్టమొదటి సర్వజనీన గ్రంథాలయమగు 'సరస్వతీ గ్రంథ నిలయము' నకు వెళ్ళుచు, దాని స్థాపకులగు మంతిన ఆదినారాయణ మూర్తిగారికి ప్రోత్సాహము కలిగించుచుండిరి. లాజరస్సు దొర గారితో చెప్పి ఆయనను తమసహాయపండితునిగా కైకొను నట్లు చేసిరి. ఈ నారాయణమూర్తిగారు మరణించిన వెనుక, అందలి నష్టశేషములగు పుస్తకములను కొని, ఆ కొన్న సొమ్ము బలవంతపెట్టి యిచ్చిన శ్రీ విక్రమదేవ వర్మగారును, వీరును విషయ భేదమునుబట్టి జాబితాలువ్రాసి, ౧౯౦౮ లో 'హిందూ పఠనమందిర'మందు 'విశాఖపట్టణ గ్రంథాలయము' అను పేర నెలకొల్పిరి. పిదప హిందూపఠన మందిరము పడిపోవుచుండుటచేత అది ౧౯౦౯ లో ధర్మాశ్రమమునకు కొనివచ్చి, భద్రపఱచిరి.

---

* గ్రంథాలయ సర్వస్వము, ౫సం. ౧భా. ౧౯౨౧. పుట_౨౬.

దేశ సంచారము చేయునపుడు గ్రంథాలయము లకు వెళ్ళి, తమ గ్రంథములిచ్చి, గ్రంథాలయ నిర్వాహకులను ప్రోత్సహించుచు, గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడు చుండిరి. ౧౯౧౦ జనవరిలో హైదరాబాదులోని 'శ్రీ కృష్ణ దేవరాయల యాంధ్ర భాషా నిలయము' చూచి, దానికి తమహాస్తము లిచ్చిరి. నెల్లూరిలోని 'తిక్కన గ్రంథాలయము'నకు తమహాస్తములు పంపిరి. ఇట్లే తిరుపతి, శృంగారపురాగ్రహారములలోని పఠన మందిర గ్రంథాలయములకును హాస్తము లిచ్చిరి.

౧౯౧౬ లో నెల్లూరు, పోట్లపాడు, ఇందుకూరు పేటలోని గ్రంథాలయములు చూచి తమ అభిప్రాయము వ్రాసిరి. నెల్లూరిలో జరిగిన గ్రంథాలయ మహా సభకు వెళ్ళి, అందు పాల్గొనిరి. వీరిని ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘ కార్య నిర్వాహక సభ్యులలో ఒకరిఁగా ఎన్నుకొనిరి. ఆ సంవత్సరముననే తెనాలిలో జరిగిన ఆ కార్య నిర్వాక సభకు వెళ్ళఁగా వీరిని దానికి అధ్యక్షులుగా ఎంచుకొనిరి. డిసెంబరు ౪ వ తేదిని 'శ్రీకలాభిలాషక గ్రంథాలయ' మేర్పఱచి, అందు బాల బాలికా శిశువును గూర్చి పాటు పడుచుండిరి.

౧౯౧౭ లో గ్రంథాలయ చరిత్ర విషయములు సమకూర్చిరి. 'జాలీ బ్రదర్సు క్లబ్బు' గ్రంథాలయమునకు హాస్తము లెరవుగా ఇచ్చిరి. ఇవే తరువాత కాంగ్రెసు గ్రంథాలయమున కెరవుగా ఇచ్చుట జరిగెను. ప్రాచ్య

లిఖిత పుస్తక భాండాగారమునకు, ౧౨ వ్రాత ప్రతులు వ్రాసికొని తిరిగి యిచ్చుటకు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సంచారములో విశాఖపట్టణమునకు వచ్చినప్పుడు, ఎరవుగా ఒసఁగిరి.

హిందూ పఠనమందిర భవనము కట్టించుటకు ప్రేరకులై, ఎంతో కష్టపడి పని చేసినను, దాని పెద్దల యేర్పాటు నచ్చమిచే, ౧౯౧౭ లో 'వసంతా ధర్మ పఠనమందిరము' నెలకొల్పుటయే కాక సరస్వతీ నిలయ శేషమును 'ఆనంద గజపతి గ్రంథాలయము' అను పేర నడప సాగిరి. దీనికి సొంత యిల్లు సంపాదించి విశాఖ పట్టణమండల గ్రంథాలయముగా చేయుటకు ప్రయత్నించిరి. ఆ గ్రంథాలయము నేఁటికిని ధర్మాశ్రమమున కలదు.

కవిగారు తమ జిల్లాలోకూడ ప్రచారముచేసి గ్రంథాలయోద్యమమును వ్యాపింపఁజేసిరి. పెక్కు తావుల యందు గ్రంథాలయములు నెలకొల్పునట్లు చేసిరి. క్రొత్త వలసలో ౧౯౨౦ లో జరిగిన జిల్లా గ్రంథాలయ మహాసభకు అధ్యక్షత వహించిరి. క్రొత్తకోట పెదమడకలలో జరిగిన గ్రంథాలయ సభలకును అధ్యక్షులుగా నుండిరి. మండల గ్రంథాలయసంఘస్థాయిసంఘమునకు అధ్యక్షులుగా ఉండి చాల పని చేసిరి. ౧౯౧౭ లో విశాఖ పట్టణమున జరిగిన అయిదవ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహా సభకు వీరును, సెట్టి లక్ష్మీనరసింహము

గారును, కార్యదర్శులుగా నుండి చేసిన సేవ ప్రశంస నీయమైనది.

౧౯౧౮ లో పిఠాపురములోని 'విద్యానంద పుస్తక భాండాగార' తృతీయ వార్షికోత్సవమునకు అధ్యక్షత వహించి వీరిచ్చిన, 'గ్రంథాలయములు-మతము' అను ఉపన్యాసము చాల ప్రశస్తమైనది.

విశాఖపట్టణము జిల్లాలో వీరు ముద్దా సోమప్ప శాస్త్రిగారితో కూడ కలసి చేసిన సేవ గణింపఁదగినది. కవిగారు సాలూరు తాలూకా శివరామపురము చని నప్పుడు అచ్చటి 'శ్రీరామ గ్రంథాలయము' వారు సన్మా నించి, పద్యరత్నములు కానుకపెట్టిరి. నేఁటి ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘములో వీరు ఒక సహాయకార్యదర్శి.

కవిగారి గ్రంథాలయ సేవను గుర్తించియే మొన్న ౧౯౩౭ లో విశాఖపట్టణమున జరిగిన కళింగదేశ గ్రంథాలయ సభలో, వీరిచిత్రమును ప్రతి గ్రంథాలయ మునను వీరి షష్టిపూర్తి ఉత్సవము నాఁడు నెలకొల్ప వలయునని, తీర్మానించిరి.

కవిగా రిపుడు విశాఖపట్టణముజిల్లా గ్రంథాలయ చరిత్రను వ్రాయుటకు యత్నించు చున్నారు.

## దంతకళాశాల—నేఁతసాల

చేతి పనులు పునరుద్ధరించి, తొల్లింటి మన ఆర్థిక సౌష్ఠవమును సంపాదింప వలయునని పాటుపడు వారిలో

మన కవిగారొకరు. వీరు, ౧౯౧౦ లో ధర్మాశ్రమమున 'దంత కలాశాల' ను నెలకొల్పిరి. చిన్న పిల్లలకు పని నేర్పించిరి. నిపుణులగు పనివాండ్రకు పెట్టుబడి పెట్టి, విరివిగ సరకులను తయారు చేయించిరి. బొంబాయి, కలకత్తా మొదలగు పెద్దనగరములకు ఎగుమతి చేయించిరి. దంతపు పనితనమునకు పేరెన్నిక గన్న విశాఖపట్టణము సరకులను గూర్చి చెప్పెడి దేమున్నది? ఈ దంతపు పనివాండ్రలో నాటుకొని యుండిన చెడు అలవాట్లు మాన్పించుటకును, మంచి దారిలోనికి త్రిప్పుటకును కవిగారు ఎంతేని పాటుపడిరి. అయినను లాభము లేకపోయెను. పనివాండ్రు సరియైన వాండ్రు కానపుడు ఏ పనులైనను సరిగా సాగుట కష్టము. ఆకారణమున కలాశాల చిరస్థాయి కా లేకపోయెను. ఆపనివాండ్రు సుమారు 3000 రూపాయలకు పైఁగా కవిగారికి దండుగ తగిలించిరి. అయినను కవిగారు వారిని ఏవగించుకొనక, వారిచే మరల పని చేయించి, చాలవఱకు నష్టము కూడఁదీసికొనిరి. తమకు నష్టము కలిగించిన వారికిని కోరినపుడు వీలగు సాయము చేయుచుందురు.

ధర్మాశ్రమములో కొన్ని మగ్గములను పెట్టించి మంచి నేత బట్టలను తయారు చేయించుచుండిరి. ఆ నాఁడు అవియే స్వదేశి బట్టలు.

౧౯౦౭ లో విశాఖపట్టణములో స్థాపించిన 'దేశీయ వస్తుశాల'కు వీరు మేనేజింగుడైరెక్టరుగ నుండి పెక్కేండ్లు

పని చేసిరి. ఆయేఁడే విశాఖపట్టణమున జరిగిన దక్షిణ దేశ పారిశ్రామిక ప్రదర్శనమునకు వీరొక కార్యదర్శిగా ఉండి, ఉత్సాహముతో పాటుపడిరి.

ఒడంబడికవలన శ్రీ అంకితము జగ్గారావుగారి 'అబ్జర్వేటరీ ప్రెస్సు' తమ చేతిక్రిందికి తెచ్చుకొని సుమారు రెండేడ్లు అందు అచ్చు పనులు చేయించినారు.

నాటక సమాజములకు వలయు దుస్తులు కుట్టించి, చెమ్కీ పనికిని, గాజుపూసల పనికిని ప్రోత్సాహము కలిగించిరి. వడుకు నూలుతో దట్టాలు నేయించి, డేరా కుట్టించిరి.

రామలీలామహోత్సవమువలన విమానపు పనికిని, బుట్టబొమ్మల పనికిని, పెంపు సమకూర్చిరి. ౧౯౩౧ లో విశాఖపట్టణ స్వదేశవస్తు ప్రదర్శన ప్రారంభసభకు అధ్యక్షత వహించి, చక్కని ఉపన్యాస మొసంగిరి.

సంఘ సంస్కరణము

హిందూ ధర్మము ననుసరించి మన పూర్వులు వర్ణాశ్రమము లేర్పఱిచి, అందుకు తగు నియమములును, అప్పటి స్థితినిబట్టి, చేసియున్నారు. కాని అవి నానాఁటికి మాఱి, నేఁడు విపరీతాచారముల క్రింద ఏర్పడి, సంఘాభివృద్ధికి ప్రబల నిరోధము లగుచున్నవి. బాల్య వివాహములు, కన్యా-వర శుల్కములు, మాలమాది గల ఎడగా నుంచుట మొదలగు చెడుసాంగెము లెన్నియో

మనలో వేరు నాటుకొనిపోయినవి. వీనికి అజ్ఞానమే కారణము. కాలమునుబట్టి అన్ని సంఘములలోను యథార్థ సంస్కరణము అత్యావశ్యక మనియు, అవి మతానుకూల ముగా ఉండవలెననియు కవిగారి తలంపు. తమ ఆదర్శము ననుసరించియే వీరు గృహస్థులైరి. అట్లే తమ బావ మఱదికి వివాహముచేసిరి. తాత్కాలికోద్రేకమువలన చేయు సంస్కరణములు వ్యాప్తి చెందకపోవుటయే కాక, సంఘాభివృద్ధికి భంగకరము లని కూడ వీరి అభిప్రాయము. ఇందును గుఱించి సంఘ సంస్కరణ సభలలో వీరు పని చేసిరి. బలిజెపల్లి సూర్యనారాయణశాస్త్రి, వడ్డాది జగన్నాథము, భూపతిరాజు వేంకటపతిరాజుగార్లు వీరితోడి సంస్కరణ ప్రియులు. పిల్లల తల్లిదండ్రు లిష్టపడి జరుపు రజస్వలానంతర వివాహములకును, వితంతూద్వాహములకును, శాఖాంతర వివాహములకును కవిగారు సుముఖులే.

పడుపువృత్తి వేశ్యా కుటుంబములలో పాఁగొట్టుటకు వట్టి ఉపన్యాసములవలన లాభము లేమిచే, మఱొకవృత్తి చూపిన లాభించునేమో అని ఆసించి, సంగీతమానినీ సమాజ మేర్పఱచి, వ్యయ ప్రయాసములకు లోనైరి.

కవిగారు అస్పృశ్యతా నివారణోద్దేశమును మన సునం దిడుకొని, ముప్పది యేండ్ల క్రిందటి నుండి మాల పల్లెలకు వెళ్ళి, ఎట్టి ఎబ్బెఱికమును లేక, వారిని చేరఁ

దీయుటకు తమ ఆమోదమును తెల్పుచు, చెడు అలవా ట్లను మాన్పింప ప్రచారము సాగించిరి. తామేర్పఱచిన రామలీల సంబరములలో హరిజనులు నిరాతంకముగా పాల్గొనునట్లు ఏర్పాటు చేసిరి. వసంతపంచమి, నవమి మొదలగు రామలీలోత్సవములందు వారు భజనలతో వచ్చి, తోడ్పడుచుందురు. ఊరేగింపు సంబరములలో నేఁడును మొదట కనఁబడు భజన 'మాదిగలదే.' ఈ భజ నదార్లు పరిశుభ్రమగు వస్త్రములు ధరించి, హరిభక్తుల వలె అలంకరించుకొని, ఉత్సవము ఎత్తినది మొదలు కొని–ఊరేగింపు ముగించు వఱకును చెదరి పోక, భక్త్యు త్సాహములు చూపుచు, భజనచేయుదురు. చూపఱకు వీరిభజనయు,దానిసజ్జును ఎంతోసొంపుగా కానవచ్చును.

కవిగారు హరిజనులను ఐందవహిత సభా పాఠశా లలో చేర్చుకొనెడివారు; వారిని వసంతా పఠనశాల కును, ఆనందగజపతి గ్రంథాలయమునకును రప్పించి, ప్రోత్సహించెడువారు; నిమ్నజాతి పాఠశాలలకు వెళ్ళి, బోధించి, పరీక్షించెడివారు; వారి వీథులలోను, భజన కోవెలలలోను మతముఁ గూర్చియు, నీతిని గూర్చియు, స్వాతంత్రవృత్తినిగూర్చియు ఉపన్యసించుచు, వారికి, పలు తెఱంగుల తోడ్పడు చుండెడివారు.

సమదర్శిత్వమే పండిత లక్షణ మను భగవద్గీతా వాక్యము వీరికి ప్రమాణము. అది వీరు అక్షరాల ఆచరణములో పెట్టి, తోడి వారికి మార్గ దర్శకులయిరి.

౧౯౦౭ లో విశాఖపట్టణమున జరిగిన సంఘ సంస్కరణ మహా సభకు భూపతిరాజు వేంకటపతిరాజు గారును వీరును కార్యదర్శులుగా నుండిరి.

## నాటి తల్లి కొలువు

ఒజ్జ పని విడిచిపెట్టి నప్పటి నుండియు సర్వస్వతంత్ర తలతోను కవిగారు రాజకీయ రంగమున దిగిరి. జిల్లా మహాసభలకు వెళ్ళి, పని చేయుచుండిరి. బెజవాడయందు ౧౯౧౪ లో జరిగిన ఆంధ్ర మహా సభకు వెళ్ళి, అందు పాల్గొనిరి. ఆసభ ౧౯౧౫ లో విశాఖపట్టణమందు జరిగినప్పుడు, తా మొక కార్యదర్శిగా నుండి, అతిథి సత్కారపు పెద్దఱికము వహించి, ఎంతో శ్రమపడి, పని చేసిరి. వీరు మొదట ౧౮౯౩ లో కాంగ్రెసు నివేదిక చదివిన నాఁటనుండి ౧౯౧౩ మెయి వఱకును చేసిన పలు తెలుఁగుల సేవ అంతయు, ౧౯౧౪ మొదలుకొని ౧౯౩౬ మెయి వఱకును చేసిన దేశ సేవకు పునాది అని చెప్పనగును. ౧౯౧౬ లో కాకినాడయందు జరిగిన ఆంధ్ర మహాజన సభకు వీరు ప్రతినిధిగా వెళ్ళి, అందు పాల్గొనిరి.

విశాఖపట్టణ పురపాలక సంఘము వారికి పన్ను చెల్లించువారి జట్టునందు, కవిగారు ౧౯౧౫ లో చేరి, ప్రజారోగ్యమును తెలిసికొనుట కయి వీథు లన్నియు పరీక్షించుచుండిరి. అవి సరిగా లేని యెడల పై పెద్దలను తీసికొని వచ్చి, కనఁబఱచుచు, బాగు పడునట్లు

చేయించుచుండిరి. విశాఖపట్టణ పురపాలక విద్యాసంఘ సహాయసభ్యులుగానుండి బడుల బాగునకయి పాటుపడిరి.

కవిగారి శిక్షణలోనున్న యువకులకుకూడ దేశసేవ చేయుట పరిపాటి అయినది. వారే 'ఐందవహిత సభ'కు నెలవారీ చందాలను వసూలు చేయుచుండిరి ; దీపావళి భిక్షలు ఎత్తుచుండిరి. ఈ నిధినుండి 'బందరు జాతీయ కళాశాలకు' కొంత ధనసాహాయ్యము చేయుచుండెడి వారు. తెలివి మొల కెత్తిన ప్రతి యువకుడును కవిగారి మొగము చూచి, వెనుదీయ లేక వారు చెప్పిన పనిని చేయుచుండెను. ఈ యువకులలో కొందఱు కవిగారు చేసిన నాటి కొలువులో తోడ్పడిరి.

భూపతిరాజు వేంకటపతిరాజుగారు మన రాజధానిలోని ఉత్తర జిల్లాల భూస్వాముల పక్షమున అభ్యర్థిగా చెన్నపురి శాసనసభాసభ్యత్వమునకు ప్రయత్నించినపుడు, కవిగారు గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, ఉత్తరార్కాటు, అనంతపురము, కర్నూలు జిల్లాలలో తిరిగి రాజుగారు నెగ్గుటకు సాయడిరి. వారి ప్రత్యర్థిచే కూడ మెప్పుపొందిరి.

మన భారతీయులు స్వరాజ్యమునకై పెక్కేండ్ల నుండి దొరతనమువారికి విన్నపములు పంపుకొను చుండుట అందఱకును తెలిసిన విషయమే. కాని వారు, 'అంతరువుల వారీగా కొంత కొంత ఇచ్చుచుండెదము ; కావలసిన వేవో తెలుపుకొనుడు' అని జవా బిచ్చు



వసంతరావు బుచ్చి సుందరరావు గారు.

చుండిరి. దానికి మనలోని పెద్దలు ప్రజల కోరికలను పట్టికగా వ్రాసి, (మాంటేగు మహజరు) ప్రజలచేత చేవ్రాళ్ళు చేయించి దొరతనమువారికి ౧౯౧౭ లో అదిపంప సమకట్టిరి. దానికి కవిగారు విశాఖపట్టణములో ప్రచారముచేసి, పెక్కురచేత చేవ్రాళ్ళు చేయించి, నను(బోటి మఱికొంద ఱాపని చేయునట్లు బోధించిరి.

ఆనీబెసెంటమ్మగారు ఏర్పాటు చేసిన 'హోము రూలు లీగు' పక్షమున కవిగారు విశాఖపట్టణములో 'స్వరాజ్య సమితి'ని ఏర్పఱచి, తామొక కార్యదర్శిగా ఉండి పనిచేసి, ప్రజలలో గొప్ప సంచలనము కలిగించిరి. బిసెంటమ్మ గారిని దొరతనము వారు నిర్బంధించి నప్పుడు కవిగారు పెద్ద సభను జరిపించి, ప్రజల అసమ్మ తిని వెల్లడి యగునట్లు చేసిరి. ఆమెయెడ తమ మన్నన చూపుటకే ధర్మాశ్రమములో నెల కొల్పిన 'ధర్మ పఠన మందిరము' ఆమె పేర పెట్టిరి.

ప్రజల బాగోగులను కను(గొని, వారి లోటులను తీర్చుటకు కొందఱు పెద్దలు 'విశాఖపట్టణ జిల్లా సంఘము' ఏర్పాటు చేసినారు. కాని దానిపనికి తనియక, అట్టి సంఘములో చేరిన లాభము లేదని, కవిగారును వసంతరావు బుచ్చి సుందరరావు గారును ౧౯౧౮ లో 'విశాఖపట్టణము జిల్లా ప్రజాసంఘము' స్థాపించిరి.

ఇంతలో బియ్యపు కఱవు వచ్చెను. ఎండకన్నెఱు( గని సిరిమంతులు కూడ వీథుల వెంట బియ్యమునకై

అల్లాడ వలసిన వారయిరి. కలెక్టరు గారి వద్ద లేనిదే బియ్యపు ఎగుమతి దిగుమతులు కా కూడ దను 'కంట్రోలు' వచ్చెను. ప్రజల పాట్లు నాఁడు ఎట్లుండెనో కంటితో చూచిన వారికే ఎఱుక. అప్పుడు వీరిద్దఱును భూపతిరాజు వేంకటపతి రాజుగారి పెద్దఱికమున విశాఖ పట్టణములో ఒక సంఘము పెట్టి, బియ్యము తెప్పించి, అందఱకును అందుఁబాటుగా దొరకునట్లు చేసిరి. తరు వాత పురపాలక సంఘము వారు పెట్టిన బియ్యపుకొట్లు ప్రజలకు అందువిడిగా నుండు నటుల కవిగారు కనిపెట్టు చుండిరి. వీరు 'కో-ఆపరేటివు స్టోర్సు' నకు సహాయ కార్యదర్శిగా కొన్ని నెలలు పనిచేసిరి. ప్రజాసంఘము పక్షమున జిల్లా అంతయు తిరిగి, ప్రజల లోటుపాటులను తెలిసికొనిరి. ౧౯౨౦ లో క్రొత్తవలసలో జరిగిన 'జిల్లా మహాసభ' యందు 'సహాయ నిరాకరణ తీర్మా నము' ఉపపాదించి, సమర్థించిరి.

నాగపురములో జరిగిన దేశీయ మహాజన సభకు కవిగారును సుందరరావుగారును కలసి - వెళ్ళి, అందు పాల్గొనిరి. అక్కడనుండి వచ్చిన తరువాత ప్రజాసంఘ మును కాంగ్రెసు సంఘముగా మార్చివేసి, దొరతనము వారితో శాంతి సమరమునకు నడుములు బిగించిరి. కవిగారు పల్లె పల్లెకును కాలినడకను పోయి, రాచఱికపు గుట్టు మట్టు లన్నియు బట్టబయలు చేసిరి; కాంగ్రెసు సందేశమును చాటిరి. బహిరంగ సభలు హెచ్చుగా

చేయుచుండెడివారు; అందు ఇతరులు అధ్యక్షులుగా ఉండుటకు జంకు సభలకుకూడ వీరు అధ్యక్షులుగా ఉండెడివారు. వైద్య విద్యార్థులు పాఠశాల మానివేసినప్పుడు వారిచే ఖద్దరు అమ్మించి కల్లు-సారాదుకాణముల దగ్గఱ 'పికెటింగు' చేయించిరి; వారి కోరికనుబట్టి వారిచే పంజాబు దురంతములు అను నాటకము ఆడించిరి. జిల్లాలో కల్లు-సారాపాటలు జరిగినపుడు ఆయా పట్టణములకు వెళ్ళి, ప్రబోధము కావించుచుండెడివారు. కెన్యాహరతాళము. సైమన్ సప్తక హరతాళము మొదలగు హరతాళములు, మేఁకల-పసుల కమేలాలు కూడ మూయించి, జరిపించుచుండెడివారు. ౧౯౨౨ లో గయా కాంగ్రెసునకు ప్రతినిధులుగా వెళ్ళిరి.

విశాఖపట్టణజిల్లా కాంగ్రెసు సంఘ మేర్పడిన పిదప దానికి మొదట కొన్ని యేండ్లు ఉపాధ్యక్షులుగాను, పిదప కొన్ని యేండ్లు అధ్యక్షులుగాను ఎన్నుకొనఁబడి కవిగారు పాటుపడిరి. ఆంధ్రరాష్ట్ర సంఘములోనే కాక, కొంతకాలము వీరు తత్కార్య నిర్వాహక వర్గములో కూడ సభ్యులుగా ఉండిరి. విశాఖపట్టణము జిల్లాలో కాంగ్రెసు పనులు బాగుగా జరుపుటకు ఒకసారి రు ౫౦౦ లును, మఱొకసారి రు ౧౫౦౦ లును తెచ్చి, పట్టణములోనే కాక, పల్లెలలో కూడ అత్యుత్సాహముతో ప్రచారముచేసి, చేయించిరి. ౧౯౨౩ లో సొమ్ము లేక విశాఖపట్టణ జాతీయోపా సంఘము ఎత్తి

వేయుటకు ఇతర సభ్యులు తలంపఁగా కవిగారు తగిన సహాయము తెచ్చి సంఘమును నిలుప సాయపడిరి.

౧౯౨౩ నవంబరులో మృత్యుదేవతా ప్రళయ తాండవమువలె, విశాఖపట్టణ మండలమున పెను గాలి విజృంభించి, మూఁడు దినములు తన భీభత్సకాండము ప్రదర్శించెను. ఊరులు ఏఱులఁ గలసెను; కడలి గట్టు దాఁటునని అందఱకును గుండెలు గడగడలాడఁ జొచ్చెను; ప్రజలు మిగుల భయకంపితులైరి. ప్రాణ రక్షణమునకై మిద్దెలెక్కిరి; చెట్ల నెగఁబ్రాఁకిరి. ఇండ్లు ధ్వంసమైనవి; మేడలు చదికిలఁ బడినవి. ప్రకృతి మేర మీఱినపుడు ప్రజలు చేసికొను స్వరక్షణము నిరర్థకము. ఎక్కడఁ జూచినను తలిదండ్రులు చనిపోయిన చంటి బిడ్డలు; పిల్లలఁ గోల్పోయిన జననీ జనకులు; పేరున కైనఁ గానరాని కుటుంబములు. జంతుజాలము పొందిన నాశనము ఊహించుట కలవి కాదు. కలిగిన యుత్పాతము భయానకమైనది.

ఈ విపత్తును గూర్చి కవిగారు విన్నకోట జగన్నాథ గుప్తగారితో తలపోసి, పనిచేసిరి. రొక్కము కొంత చేకూరినది. కవిగారును మల్లిమడుగుల కోదండ రామ స్వామిగారును జిల్లాయంతయు తిరిగి, ఎత్తువడిన పేదలకు డబ్బు సాయము చేసిరి. విశాఖపట్టణమున జగన్నాథ గుప్త, సబ్నివీసు సత్యకేశవరావు గార్లతో పని చేసి, వెలమ పేటలో భజనకోవెలతో కూడ ౧౯౨౫ లో

'గాంధీనగరము'ను కట్టించిరి. అ. భా. కాంగ్రెస్ సంఘము ౧౯౨౩ లో విశాఖపట్టణ మందు కూడి నప్పుడు సభ్యులకు భోజనాదిసదుపాయములు చూచుటకు సభలకు కూడ వెళ్ళకుండ 'టర్నరు సత్రము' లోనే ఉండి, కవిగారు పనిచేసిరి.

వీరు ౧౯౨౩ లో కాకినాడ కాంగ్రెస్సుకు ప్రతినిధులుగా వెళ్ళిరి. ౧౯౨౪ లో ఆంధ్రరాష్ట్ర సంఘమువారి ఏర్పాటును బట్టి జిల్లా అంతయు తిరిగి కాంగ్రెసు పనులు మిక్కిలి శ్రద్ధతో జరపుచుండిరి. జిల్లా సంఘమునకు అధ్యక్షులుగా నుండియు, స్వరాజ్యపక్షము వారు పని చేయఁ దలఁచి నప్పుడు తమ పదవి వదలికొని, వారికి అవకాశ మిచ్చిరి. అయినను తమ నియమమునకు భంగము లేకుండ వారికి సాయము చేయుచుండిరి. మ్యూనిసిపాలిటీ, తాలూకా బోర్డు, జిల్లా బోర్డు ఎన్నికలలో కొన్నిసార్లు పాల్గొని, కొన్నియెడల దెబ్బలాటలు తప్పించిరి.

ఇట్లుండఁగా ౧౯౨౫ లో అఖిలభారత చరఖా సంఘము-ఆంధ్ర శాఖవారు, కవిగారిని ఖద్దరు ప్రబోధము సాగింపఁగోరిరి. ఆ ప్రకారము వీరు గంజాము, విశాఖపట్టణము, తూర్పుగోదావరి జిల్లాలలో తొమ్మిదినెలలు పల్లెలకును, పట్టణములకును పోయి, 'మేజిక్కులాంతరు' బొమ్మలతో ఉపన్యాసము లొసంగుచు, ఖద్దరు భుజములపై నిడుకొని విక్రయించిరి. వీరి ఉపన్యాసముల వలన

జానపదులలో కూడ ఎంతో ప్రబోధము కలిగినది. ఈ ప్రచారము చేయునపుడు ఈ మనుగడ వ్రాఁతరి వారికి తోడుగా నుండెను.

దక్షిణాఫ్రికా రాయబారులు విశాఖపట్టణము వచ్చినపుడు చింతలపాటి వేంకట నరసింహరాజుగారి సాయముతో వారిని ఆదరించి, సర్ బి. యన్. శర్మగారి అధ్యక్షతక్రింద సభచేయించిరి. ఆంధ్రదేశ సంచారమున గాంధీ మహాత్ముఁడు విశాఖపట్టణమునకు వచ్చినప్పుడు సన్మాన సంఘమునకు అధ్యక్షులుగా ఉండి, మహాసభలో వారికి కవిగారు సొమ్ము - కానుక సమర్పించిరి. జిల్లాలోని అన్నిపక్షములవారిని చేర్చి, జిల్లా సేవక సంఘ మేర్పాటు చేయుటకు భూపతిరాజు వేంకట పతిరాజుగారును వీరును ప్రయత్నించిరి.

౧౯౩౦ ఏప్రెలులో 'ఉప్పు సత్యాగ్రహము' ఉప్పెన వలె వచ్చినది. అప్పటికి కవిగారు జిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షులుగా ఉండిరి. దేశమంతటితోపాటు ఈ జిల్లాలోని కాంగ్రెసు ప్రముఖు లందఱును ఏకమై, సత్యాగ్రహమును సాగింప నిశ్చయించిరి. కవిగారిని జిల్లా నియంతగా ఎన్నుకొనిరి. తెన్నేటి విశ్వనాథము గారిని మొదటి పడవాలు గా నియమించిరి; ఈయన నాయకత్వముక్రింద జిల్లాలోని సత్యాగ్రహదళము విజయనగరము నుండి బయలుదేఱినది. భమిడిపాటి చినయజ్ఞనారాయణ శర్మగారి నాయకత్వము క్రింద మాడుగుల

నుండి ఒక సత్యాగ్రహదళము వచ్చినది. ఈ దళములు చేరిన పిదప విశాఖపట్టణ సముద్రతీరమున కవిగారి పెద్దరికము క్రింద ఉప్పు చట్టమును ఉల్లంఘించి, సత్యాగ్రహము ప్రారంభించిరి. ఆనాఁడు కలిగిన సంచలన మసమానమైనది. విశాఖపట్టణ సముద్రతీరము ఇసుక వేసినరాలని ప్రజాసమూహముతో నిండిపోయినది. పుర మందిరము దగ్గఱనుండి తీర్థపురాళ్ళ వఱకును కాంగ్రెసు వారితోపాటు తక్కిన వారు కూడ ఉప్పు చేయ సాగిరి. అంతటితో ప్రభుత్వనిరోధ మారంభ మయ్యెను. సర్వ సేనాని యగు కవిగారిని, దళనాయకులగు విశ్వనాథము గారిని, ముఖ్యనాయకులగు యజ్ఞనారాయణశర్మ, కొల్లూరి సూర్య నారాయణగుప్త, దిగుమర్తి వేంకటరామస్వామి గార్లను ప్రభుత్వము వారు నిర్బంధించి, ఆఱు నెలలు కారాగారమున కంపిరి.

చెఱనుండి విముక్తు లయిన పిదప కవిగారు, ౧౯౩౧ లో అఖిల భారత చరఖాసంఘు—ఆంధ్రశాఖ వారు విశాఖ పట్టణము జిల్లాలో వఱదల వలన నష్టపోయిన వారికి పంచిపెట్టుటకు పంపిన బట్టలు వారికి అందఁజేయు టకు, ఏర్పాట్లు చేసిరి. కోనాడలో స్వయముగా ఉండి, అక్కడివారికి బట్టలుపంచిపెట్టించిరి. తరువాత ఈజిల్లాకు మరల నియంతగా ఏర్పడి, కార్యక్రమము సాగించుటచే ౧౯౩౨ ఫిబ్రవరిలో వీరిని ఎలమంచిలిలో ప్రభుత్వము వారు నిర్బంధించిరి. ఒక సంవత్సరము కఠిన శిక్ష విధిం

చిరి. దేశహితైక కార్యముల వలన వీరు మొదటి నుండియు ప్రభుత్వ గూఢ చారుల దృష్టియం దుండిరి. ౧౯౦౬ లో బుచ్చి సుందర రావుగారి కోరికపైని మన కవిగారు పెద్దతికము వహించి, తమ నాటక శాలలో 'శివాజీ జయంతి' జరిపిరి. ప్రభుత్వమువారు వీరి గుట్టు మట్టులు తెలిసికొనుట కొక గూఢచారుని ధర్మాశ్రమము నకు పంపిరి. అతఁడు యోగి వేషమున వచ్చి, కవిగారి ఆశ్రమముననే నెల దినములుండి, వీరు మతప్రచారకులని మాత్రము వ్రాసికొని వెడలి పోవలసివచ్చెనఁట.

కవిగారు నిర్బంధ విముక్తులయిన పిదప ౧౯33 లో కలకత్తా యందు జరిగిన కాంగ్రెస్సుకు ఈ జిల్లా నుండి ఆఱుగురు ప్రతినిధులను పంపుటకు ఎంతో కష్టపడి, ఏర్పాటులు చేసిరి. అప్పటికి వీరు దేశసేవ చేయ నిశ్చయించుకొని నలువది యేండ్లయ్యెను. తాము చేయఁగలిగినదానికంటె చేయఁ గలుగునది తక్కువగుటచేతను, తెనుఁగు నిఘంటువు పని చేయునట్లు ౧౯౨౮ లో ప్రచురించి యుండుటంబట్టి — ఆ పని చేయ వలసి యుండుట చేతను, కాంగ్రెసు పని వెనుకఁబెట్టి తెనుఁగు తల్లి కొలువే తమ మనుగడ పనిగా చేసికొని, ఆమెను గద్దె ఎక్కించు తలంపున 'తెనుఁగు గుడి' పని మిన్నగా ఎంచి, పాటుపడ మొదలిడిరి.*

---

* కవిగారి దేశ సేవ నుద్దేశించి మున్నంగి......శర్మగారు భావ సం॥ భాద్రపదమాస భారతిలో ఇట్లు వ్రాసిరి—

బెజవాడ దగ్గఱి గుణదలలో కొన్ని సంవత్సరముల నుండి పనిచేయుచు, ఇప్పుడు గాంధీమహాత్ముని పరిశీలనము క్రిందనున్న 'ఖద్దరు సంస్థానము' శిక్షణనిలయము ఒకటి ఏర్పఱచు కొనినది. ఆశిక్షణనిలయమువారు కవిగారిని గౌరవాధ్యక్షులుగా ఎన్నుకొనుటచే వీరు భావ సంవత్స రాది నుండి ఆపని చూచుచున్నారు.

---

"కరాళ గహ్వరముం దెఱచి జూలు విదల్చిన కాంగ్రెసు సింహము నెదుట తనకట్టిన దీక్షాకంకణము నేఁటిదాఁక విడువఁడు. ఈయన కాంగ్రెసు ఉద్యమమున కరఁగినాఁడు. కాఁపురమునే కాంగ్రెసుగ మార్చినాఁడు. గడ గట్టి కాంగ్రెసు ప్రచారము సాగించినాఁడు. పూర్వము తన వేసిన మార్గమున, తన నేఁటి నిమ్న జాత్యుద్ధరణాది కాంగ్రెసు ప్రచారము, పూర్ణ ప్రవాహముమీఁది పూదెప్ప పయనముగ సాగినది.—ఇపుడు కాంగ్రెసు గ్రంథమును గట్టిపెట్టి, నిఘంటు రచనాసమాధిం బ్రవేశించినాఁడు."

పురిపండా అప్పలస్వామిగారు ౧౯3౨ ఆగస్టు ప్రబుద్ధాంధ్రలో ఇట్లు వ్రాసిరి—

'నాదేశం సంకెళ్లనుండి విముక్తిపొందే మార్గమేమిటి? నా తెనుగు బాస ఉత్కృష్ట స్థానం ఆక్రమించడ మేలాగు? నిరు పేదలగు నా దేశీయుల జీవనానికి ఆధార మేమిటి?' నిద్రలోనూ, నడకలోనూ, పగలూ, రాత్రీ ఒకపు డేమిటి? సర్వకాల సర్వా వస్థలయందూ ఇదే ఆ వేదన మా శాస్త్రిగారికి. ఈ ఆవేదనలో ఆయనకు స్వవిషయం స్మరణకు రాదు. ఈ ఆవేదనతోనే ఆయన అరువదేండ్ల జీవితమూ దేశానికీ, భాషకీ, సంఘానికీ ధార పోశారు; ధారపోస్తున్నారు. ఇలాంటి ఉత్తమ జీవులు మన దేశంలో—ముఖ్యంగా మన తెనుగు నేలలో ఎందరున్నారు?"

## తెనుఁగుతల్లి కొలువు.

పిన్ననాఁటనే కవిగారికి తెనుఁగునందు మక్కువ మెండు కొనినది. తెనుఁగు తల్లిని కొలుచు వారలలో కవిగారిని చెప్పి మఱొకరిని చెప్పవలె ననుట నిజమునకు దప్పు కాదు. వీరు తమ మక్కువను తొమ్మిదవ యేఁటి నుండియు—కాకినాడకు వచ్చినది మొదలుకొని—చూపఁ దొడఁగి, పదునాఱవ యేఁటనే (౧౮౯౦) కవిత్వము చెప్ప మొదలిడిరి. చదువుకొను నపుడే వీరు కవి బిరుదమును గడించుకొనిన మాట మనకు తెలిసినదే. ఈ మెఱుఁగే వీరికి తోడి పిల్లల వల్లనే కాక, ఒజ్జల వలన సైతము మన్నన కప్పము సమకూర్చినది. చేయఁగలనని చూపుటకు ఆ దినములలో ఒకనాఁడు ధర్మాశ్రమముననే అష్టావధానము * కూడ చేసి యుండిరి. కాని అవధానముల వలన బాసకు కలుగు ప్రయోజనము సున్న అని వీరి తలంపు.

మొదట వీరి కవిత్వము సంస్కృత శబ్దాడంబరముతో నుండెడిది. సింగారపు టెన్నికలకును కొఱంత లేదు. ఎలజవ్వనము తలకొని నూనూఁగు మీసలు పొడ కట్టుచున్న ప్రొద్దులలో—ఎక్కటి తలంపు తంపరలు తలలో గంతు లిడినవి. అపుడు తమ బసలయిన మేడలను అలంకరించుచుండిన జర్మను—రవివర్మ చిత్తరువులు చూచి, వీరు సింగారపు తేనియ లొలుకు వృత్తము

---

* ఆ అవధానములోని కొన్ని పద్దెములు—

లును, వృత్త మాలికలును, వ్రాయ మొదలిడిరి. 'విశ్వామిత్రుఁడు - మేనక, రాధ - కృష్ణుఁడు, సుభద్ర - అర్జునుఁడు' మున్నగు చిత్తరువులు వర్ణించి వ్రాసిన పద్దె

---

చ. బలితపు గాలిచేత కదుపంబడునట్టి కెరళ్ళ తాఁకునన్
నిలుకడ లేక యిట్టటును నీరధిమీఁదను ఊఁగు నావలో
పలఁగల దీపసంతతులు పాయక ఊఁగుచునుండ, వానికాం
తులు పయిఁ బర్వి చూపఱకు తోరపు వేడుక చేయుచుండెడున్.

చ. తల ఒకయింత వంచుకొని తల్పము చేరఁగ సిగ్గు చెందుచున్
వల పొక మూల డెందమున వర్ధిల పొంపఁగ ఓరచూపులన్
చెలువుని చూచుచో, అతఁడు చెంగున మంచము డిగ్గ దాఁటి,ఆ
చెలిచెయి పట్టి పాన్పుపయి చేర్ప, సుఖింతురు వారలంతటన్.

సుగంధి. ఎండ కాఁకచేత వాడి, ఏపు మాసి క్రమ్మఱన్,
మెండు జబ్బుచేత చిక్కి మెల్ల మెల్ల తేఱుచున్
కండపట్టు రోగులట్లు, క్రొాలు నుండు తీవెలన్
నిండి, కన్ను విందు చేయ నేర్చు తోఁట చూడుమా.

చ. జలదము నవ్వఁజాలెడు కచంబు మెఱుంగున, చంద్రబింబమున్
కలఁతపడంగఁ జేసెడి మొగంబున, చెందొవలన్ హసించు మేల్
తళుకు బెడంగు కన్గవను, తామర మొగ్గలఁ బోలు చన్గవన్
కులికెడు-అందకత్తియలఁ కోరక ఉందురె ఎట్టివారలున్ ?.

క. ఎక్కడ నుండిన నేని-తు
పుక్కున ఉమ్మఁగ నొనర్చు; బుద్ధి కలంచున్ ;
క్రక్కులు కలిగించును ; అ
మ్మక్క ! చెడు పొగాకు కిల్లి మానఁగ వలదే ?.

క. దూరాలోచన బుద్ధి అ
పారముగా ఒసఁగనేని, పనిపాటులు వి
స్తారముగ పాడుచేయుటఁ,
సారమతుల్ మానవలయు చదరంగంబున్.

ఉ

ములు, ముద్దులు మూటఁ గట్టుచుండును. వీనిలో కవి గారు తొలుత ౧౮౯౩ లో వ్రాసిన చిత్రరువు సరమే సెట్టి లక్ష్మీనరసింహముగారి 'చిత్రమాలికల'కు మేలు బంతి అయినది. *

ఒకనాఁడు కవిగారు, సెట్టి లక్ష్మీ నరసింహముగారు మొదలగు మిత్రులతో చెలియలి కట్టకు షికారు పోయిరి. అపుడు, వైదిక కవిత్వము కంటె నియోగి కవిత్వము జటిలముగ నుండుననియు, వైదిక కవిత్వము జటిలముగా ఉండ నేరదనియు లక్ష్మీనరసింహముగారు చెప్పిరఁట. అంత కవిగారు అది సరి కాదనిరఁట. "అయిన నొకటి ఉదాహరణ మిండు" అని లక్ష్మీనరసింహముగారనఁగా, అపుడు కవిగారు, 'నరసింహ కృష్ణరాయని' అను పద్యముకంటె గడబిడగ నున్న—

"భూభృద్భిత్కరి కరిభి
ద్భూభృద్భృచ్ఛయన శేష భూభృత్తహిభృ
ద్భూభృ ద్భూభృద్భిద్ధయ
భూభృద్భిద్రూప కీర్తి భూషణుఁ డితఁడో."

అను కందము చదివిరఁట! "ఇది నియోగి కవిత్వమే అయి యుండవలెను; మీరిది వైదికిదే అనుచో, దీని కర్త ఎవ్వరో రుజువు చేయుఁడు" అని లక్ష్మీనరసింహముగారనఁగా, "ఇది వ్రాసిన వాఁడను నేనే" అని కవిగారు

---

* చూ. పీఠిక—చిత్ర మాలికలు.

సమాధాన మిచ్చిరఁట. * ఈ పై విషయమును బట్టి కవిగారు అప్పటి వ్రాఁతలో సంస్కృత పదము లెంత హెచ్చుగా వాడు చుండెడివారో తెల్లము కాఁగలదు.

కాని, తలఁపులు పరువునకు వచ్చిన కొలఁదిని కవి గారి వ్రాఁతలలో సంస్కృత శబ్దాడంబరమును, శృంగార వర్ణనమును తావులేకుండ తొలఁగి పోయినవి.

౧౮౯౭ నుండియు కవిగారు తెనుఁగులో మంచి మార్పులు చేయవలసి యున్నట్లు గుర్తించిరి. వీరి వ్రాఁతలు పరికించువారికి వీ రెట్టి మార్పులు తలపెట్టినదియు తెలియఁగలదు. కొన్ని యెడల వాడుక భాషను కూడ అంగీకరించి, అందు కొన్నివ్యాసములును వ్రాసిరి.

౧౯౧౧ లో విశాఖపట్టణము కలాశాలలో జరిగిన ఉత్తర సర్కారుల ఉపాధ్యాయుల సభలో పిల్లలకు గ్రాంథికమున బోధింపవలెనా? వ్యావహారిక భాషలో బోధింపవలెనా? అను వివాదము జరిగినది. ఇరుతెగల వారును గట్టిగా వాదములు సాగించిరి. అపుడు కవిగారు రెండు పక్షముల వారికిని రాజీ పద్ధతిని సూచించి యుండిరి. ౧౯౧౪ లో కాకినాడయందు జరిగిన ఆంధ్ర పరిషత్సభకు వెళ్ళి, అచ్చటి 'క్లబ్బు' నందు జరిగిన సభలో వాద ప్రతివాదములు తీవ్ర రూపము దాల్చినపుడు, "ఇట్టి వివాదములతో కాలయాపనము చేయుట

---

* ఇది సెట్టిలక్ష్మీనరసింహముగారు ౧౯-౭-౧౯౩౪ తేదిని కవిగారి సన్మానసభలో తెల్పిరి.

కంటె రెండు పక్షముల వారును పూన్కితో తెనుఁగు తల్లిని కొలుచుట మంచి దనియు, కొన్ని పట్టులందు గ్రాంథికవాదులు వాడుక నుడులు వాడక తప్పదు కాన-దానిని ఏవగించుట కూడ దనియు, వ్యావహారిక భాషా వాదులు కొన్నియెడల గ్రాంథిక రూపములు వాడవలసి వచ్చును గాన గ్రాంథికభాష అసలే పనికిరాదని నిరసింప రాదనియు నుడివి యుండిరి.

కవిగారి మొదటి గ్రంథము 'పశ్చాత్తాప మహాత్త్వము' పరీక్షకు చదివిన 'పేరడైజ్ అండు పెరీ' అను దానినిబట్టి వ్రాసినది. వీరు వ్రాసిన పొత్తముల జాబితా ఈ క్రింద పొందు పఱచుచున్నాను.

## నాటకములు

| | | | |
|---|---|---|---|
| నలనాటకము | ౧౮౯౧ | సిపాయి పెండ్లము (అసం.) | |
| కిరాతార్జునీయము | ౧౮౯౫ | ఆర్యదండయాత్ర (అసం.) | ౧౯౦౦ |
| గయనాటకము (అసం.) | ౧౮౯౬ | రాజ్యలాభము | ౧౯౦౦ |
| సావిత్రీ విజయము | ౧౮౯౬ | రాజసూయము (అసం.) | ౧౯౦౨ |
| విజయ విలాసము | ౧౮౯౬ | పారిజాతాపహరణము | ౧౯౦౨ |
| పాండవ జననము | ౧౮౯౭ | బిల్హణీయము | ౧౯౦౨ |
| కుమారాస్త్రవిద్యా సందర్శనము | ౧౮౯౭ | ధీరహరిశ్చంద్రము | ౧౯౦౪ |
| భీమ విజయము | ౧౮౯౮ | ప్రహ్లాద విజయము | ౧౯౦౬ |
| కంసవధము (అసం.) | ౧౮౯౮ | సారంగధర విజయము | ౧౯౦౯ |
| ద్రౌపదీ స్వయంవరము | ౧౮౯౯ | సీతాసందర్శనము | ౧౯౧౧ |
| కన్యకాంబికావిజయము | ౧౯౦౦ | ప్రతాపచంద్రగుప్తము (అసం.) | ౧౯౧౧ |
| మృచ్ఛకటికము (అసం.) | | | |

నాటకరామాయణము (అసం.) ౧౯౧౪

జగన్నాథభాణము (అసం.) ౧౯౧౭

జ్యూలియస్ సీజరు (అసం.)

రాజగోపాల ప్రహసనము ౧౮౯౬

## హరికథలు

హరిశ్చంద్ర కథ ౧౯౦౪

రామదాసు కథ ౧౯౦౪

కన్యకాంబికావిజయము (అసం.) ---

## పద్యకావ్యములు

పశ్చాత్తాపమహత్త్వము ౧౮౯౨

విఘ్నేశ శతకము ౧౮౯౨

చిత్రమాలికలు

రామ శతకము ౧౯౨౫

కనకదుర్గ శతకము (అసం.) ౧౯౨౫

బిడ్డ శతకము (అసం.)

మహోపద్రవతత్త్వము (అసం.)

మార్కండేయ నక్షత్రమాలిక

సత్యవ్రతి

ప్రశ్నోత్తరమాలిక ౧౮౯౭

ఎలుకసెట్టికత ౧౯౦౨

తెనుఁగు సంధ్యావందనము '౦౪

పుణ్యగిరియాత్ర (అసం.) ౧౯౦౮

ఋగ్వేద సంహిత-ఎంపుడు పద్యములు (అసం.) ౧౯౦౯

భారతమ్మ-ఓదార్పు

మహాత్మపద్యావళి మొదలగునవి.

## చాటువులు

పంచరత్నములు.

నవరత్నములు

దండకములు

మేలుకొలుపు

హెచ్చరిక

భారతమ్మవందనము

పాటలు

కృతులు

కీర్తనలు

స్మారకపద్యములు

దేశీయ గీతములు

అరయిక పద్దెములు

ప్రార్థనలు

ముసిఁడిపండు

సఫోటూ

మోదుగుపువ్వు

కాకిబంగారు

కవి

సంబరములు
దసరా పద్దెములు
ఇంగ్లీషు-అనువాదములు
పారసీ-అనువాదములు
సమస్యలు
వారణమాలిక
ప్రబోధములు
భాస్కరమాలిక
శశికళ
సంవాదములు
సంస్కృతానువాదములు
జయంతులు
వర్ణనములు
ఆస, మొదలగునవి.

## వచనములు

కథా రత్నాకరము,౧భాగము, అవతార కథలు ౧౯౧౨
ఎన్నికమణులు ౧౯౨౬-౨౭
కనకము ౧౯౦౫
సావిత్రీకథ (స్త్రీలకు) ౧౯౩
శ్రీరాముఁడు (అసం). ౧౯౦౦
సిగరెట్టు ౧౯౧౩
విద్యార్థులకు-హితోపదేశము ౧౯౦౪
మానవ విధి ౧౯౦౪
గ్రంథాలయ చరిత్ర ౧౯౧౭
జాతీయ విద్యాప్రణాళిక ౧౯౨౨
విశాఖపట్టణ చరిత్ర (అసం.) ౧౯౨౨
బాలభారతము (అసం)౧౯౨౨
బాలరామాయణము ౧౯.౨౪
మనదాస్యవిముక్తి (అసం.) ౧౯౨౪
పరశురామావతారకథ (అసం.) ౧౯౨౪
లీలావతారములు (కొన్ని) ౧౯౨౬
భారతకథలు (కొన్ని) ౧౯౨౯
మన బీదతనము(అసం) ౧౯౨౯
బుద్ధుఁడు (అసం.) ౧౯౨౯
ఆర్థికస్థితి సూచిక
భారతమ్మ (అసం.)
మొదలగునవి.

## వ్యాసములు

మన మతము ౧౯౨౯
ఇప్పటి చదువులు-బ్రతుకు తెరువులు (అసం.) ౧౯౨౭
ఇప్పటి చదువు ౧౯౨౦
ఆనీబిసెంటుగారి జీవితము
స్త్రీ విద్య
కర్మయోగము ౧౯౨౬
గ్రంథరచన
గ్రంథ మాలికలు ౧౯౧౬

తెనుఁగు వార్తా పత్రికలలో వాడే భాష ౧౯౧౭
మనం బాగుపడడం ఏలాగు ౧౯౧౭
సేవావృత్తి
వసంతమ్మగారి ప్రవాస శిక్ష ౧౯౧౮
శిష్యత్వము
దురభ్యాసములు ౧౯౧౯
వసంతమ్మగారు-లోకసేవ ౧౯౩౧
త్రిలింగము నాటి పెంపు-చదువు ౧౯౩౩
తెనుఁగు-పరిపూర్ణ పాండిత్యము ౧౯౨౮
తెనుఁగు-తోఁబుట్టువులు ౧౯౩౧
తెనుఁగు-తోడులు (కొంత) ౧౯౩౪
ఆనంద గజపతి మహారాజుగారు విగ్రహారాధనము ౧౯౨౩
మొదలగునవి.

## అనువాదములు

పశ్చాత్తాపమహత్త్వము ౧౮౯౨
ఆర్తావనచరిత్ర ౧౮౯౪
రసికజనరంజనుని కథ (అసం.) ౧౮౯౫
చిత్రకథారత్నావళి (అసం.) ౧౮౯౫
వేదసారము (అసం.) ౧౯౦౬
వ్యవసాయ శాస్త్రము ౧౮౯౯
ఆర్యుల సాంఘికస్థితి ౧౮౯౯
దక్షిణాపథమందలి వివాహాచారములు (కొన్ని) ౧౯౦౮
స్వయంకృషి (కొంత) ౧౯౧౦
గ్రీకువీరులు (కొంత) ౧౯౧౧
ఆరోగ్యము-గృహనిర్వాహకత్వము (కొంత) ౧౯౧౨-౧౫
ఎమిగ్రేషన్ ఆఫ్ ఇండియా కమిటీవారి రిపోర్టు ౧౯౧౪
భరతఖండ సంస్కారము ౧౯౧౬
గోఖలే జీవితము ౧౯౧౭
భరతఖండ జాతీయత ౧౯౧౭
ఆర్యసమాజము ౧౯౧౭
భరతఖండ రక్షకసైన్యము-(ముఖ్యాంశములు) ౧౯౧౭
బిజినెస్ బుక్కు (ముఖ్యాంశములు కొన్ని) ౧౯౧౭
యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా (లజపతిరాయి-అసం.) ౧౯౧౮
భారత మహాజాతి (కొంత) ౧౯౧౮
దేశీయ వృత్తులు ౧౯౧౮
వ్యవసాయాభివృద్ధికి లోపములు ౧౯౧౮

భరతఖండ సాంఘిక
చరిత్ర ౧౯౧౮
పనిపాట్లు ౧౯౧౯
చేతి మగ్గపు నేత ౧౯౧౯
మన వృత్తి చరిత్ర ౧౯౧౯
భారత సామ్రాజ్యాదా
యములు ౧౯౨౧
వ్యయ సంస్కార సంఘ
నివేదికము ౧౯౨౩
భూమండల జ్ఞానము ౧౯౨౫
ఔరంగజీబు కాలపు
టిండియా ౧౯౨౫
ఔరంగజీబు చరిత్ర ౧౯౨౫
శివాజీ చరిత్ర ౧౯౨౬
హిందూదేశ చరిత్ర (కొంత
పి. టి. శ్రీనివాస అయ్యం
గారిది) ౧౯౨౬

ఋగ్వేదపు టిండియా
(కొంత) ౧౯౨౬
సంస్కృత వాఙ్మయ చరిత్ర
(కొంత) ౧౯౧౪-౧౯౨౫
ఇండియా ౧౯౨౪
చేతివడుకు-నేత ౧౯౨౪
లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండి
యా (నాలుగవ సంపుటము
ముఖ్యాంశములు) ౧౯౨౬
ఇంపీరియల్ గజిటిర్ ఆఫ్
ఇండియా ప్రోవిన్షియల్
సీరీస్, మెద్రాసు-
ముఖ్యాంశములు ౧౯౩౨
లోధియన్ కమిటీ రిపోర్టు
(ముఖ్యాంశములు) ౧౯౩౨
మొదలగునవి.

## ఇతరములు

భాషాభాగము ననుసరించి
'శబ్దరత్నాకర' పద వి
భజనము ౧౮౯౯
నుడిగని (అసం.)
౧౯౧౦
వ్యాకరణాంశములు ౧౯౦౦
నన్నయ నుడులు ౧౯౦౦
అర్థానుస్వార శబ్దావళి ౧౯౦౦
ఆంధ్రకవితా మార్గ
ప్రదర్శిని (అసం.) ౧౯౦౦

దేశ్యములు ౧౯౦౦
తుదలనుబట్టి విడఁదీసిన అచ్చ
తెనుఁగు ధాతువులు౧౯౦౧
తుదలనుబట్టి విడఁదీసిన
ఔపవిభక్తికములు ౧౯౦౨
మొదటితరగతి వ్యాకర
ణము (కొంత) ౧౯౦౩
భాషాభాగము ననుసరించి
విడఁదీసిన
బాల-ప్రౌఢ వ్యాక
రణ సూత్రములు ౧౯౦౩

విద్యార్థి నిఘంటువు (అసం.) ౧౯౦౪

తెనుఁగు నుడి కలయిక (కొంత) ౧౯౦౪

అక్షరాభ్యాసము ౧౯౧౧-౧౯౧౯

ఆంధ్రలిపిసంస్కారము

సంక్షిప్త లిపి ౧౯౧౩

వెంకన్నదొర బోగట్టా ౧౯౧౩

మనుష్య జన్మము-దాని ప్రయోజనము ౧౯౧౫

జీవకారుణ్యము-స్మరణామృ తము అను గ్రంథముల విమర్శనము ౧౯౧౭

పేర్లదండ ౧౯౨౨

తెలుఁగు వేవెలుఁగు ౧౯౨౬

తెలుఁగు వెన్నెల ౧౯౨౬

నన్నయ వాడిన నుడులు (వరుసవారీగా) ౧౯౨౯

శాంతిపర్వము (పీఠిక) ౧౯౩౧

విజ్ఞాపనములు

విన్నపములు

మనవులు, మొదలగునవి

## ఉపన్యాసములు

శ్రీరామాయణ కథోపన్యాసములు

మతనీతి బోధోపన్యాసములు

రాజకీయ విషయికోపన్యాసములు

పారిశ్రామిక విషయికోపన్యాసములు

జన్మసాఫల్యము

తిలకు జీవితము

ధ్యానము

తపస్సు

ఈశ్వరచంద్ర విద్యాసాగర జీవితము

బుద్ధ జీవితము

గురుత్వము

గాంధి మహాత్ముని జీవితము

పంజాబు ఘోరములు

శ్రద్ధానందస్వామి జీవితము

గోఖలే జీవితము

రామ మోహనరాయల జీవితము

వసంతా జీవితము మొదలగునవి-పెక్కులు

## పరిష్కరించినవి

భారతము, ఆదిపంచకము (శ్రీ శారదామకుట ముద్రాక్షరశాలవారి ప్రచురణము)

శతకంఠ రామాయణము

ఆంధ్ర భాషార్ణవము (శ్రీ పరవస్తువారి ప్రచురణము)

| | |
|---|---|
| భావనాఋషి మాహాత్మ్యము | జయదేవు |
| సౌభాగ్య రత్నాకరము | బంధుసేవ |
| గిరిజా పరిణయము | ప్రసన్నాంజనేయము |
| రామలింగేశ శతకము | శాకుంతల నాటకము |
| కుక్కుటేశ్వర శతకము | నృకేసరీ శతకము మొ. |
| జయంత జయపాలము | |
| పీష్వానారాయణరావు వధ | పెక్కులు. |

పై వానిలో కన్యకాంబికా విజయమును, పారిజాతాపహరణమును, బిల్హణీయమును, తెలుఁగు సంధ్యావందనమును, మానవవిధియు, అవతారకథలును, ఎన్నికమణులును, వీరి 'శ్రీకలాభిలాషక కావ్యమాలిక'లో వెలువడినవి. ఈ కావ్యమాలిక ౧౯౦౮ లో స్థాపించిరి. ఇదియే తెనుఁగునాట మొదట వెలసిన కావ్యమాలిక. దీనికి విన్నకోట అప్పల నరసింహులు సెట్టి గారు అండగా నుండిరి. తక్కిన వానిలో కనకమును కొన్ని వ్యాసములును మాత్రమే అచ్చుపడినవి. మిగిలినవి ఇంతవఱకును వెలువడకుండుట తలంపునకు వచ్చుచో వగపు పొడముచుండును.

తమ తలంపులను సరిగా తెలుపుటకు వెలువడిన 'నుడులు'పడునట్లు వీరు కొన్ని క్రొత్తవృత్తములు కల్పించి తగిన పేరులతో కొన్నియెడల వాడి, తమ కైతపస వెల్లడించిరి. వాని పేరులు చూడుఁడు—రౌద్ర వృత్తము, పరాక్రమ వృత్తము, వీర వృత్తము, సేబాసు వృత్తము, తలఁపు వృత్తము, విజిత వృత్తము, సమ్మోద వృత్తము,

ప్రోత్సాహవృత్తము, గంభీరవృత్తము, ఉద్రేకవృత్తము, ప్రతాప వృత్తము, వితర్క వృత్తము, కరుణావృత్తము, సౌఖ్యవృత్తము, కోకిల వృత్తము, ప్రమోదవృత్తము, అందము వృత్తము, జెండా వృత్తము, ధ్యేయవృత్తము, ధర్మ వృత్తము, జయ వృత్తము, వీరానంద వృత్తము, అధ్యక్షవృత్తము, ఆశీర్వచన వృత్తము, గంధివృత్తము, స్వరాజ్య వృత్తము, కమలావృత్తము, ధ్యాన వృత్తము.

కళాశాలలో విద్యార్థులకు బోధించు దినములలో కవిగారు తెనుఁగున సరియగు వ్యాకరణము లేని లోపము తెలిసికొని, తెనుఁగు సొంపును సరిగా వెల్లడించు 'నుడి తీర్పు' వ్రాయుటకుఁ బూనుకొనిరి. 'సంస్కృతపు నుడి తీర్పుల'లోనుండి కైకొనుచుండిన పారిభాషిక పదముల మక్కీలు వదలివేసి, గుర్తు నుడులు కూడ తెనుఁగుననే ఏర్పఱుచుకొనిరి. "తెనుఁగు ముక్కలకు వ్యుత్పత్తి ఏమిటి ?" అను వెఱ్ఱి మాటకు వగచి, కవిగారు తెనుఁగు తోఁబుట్టువులను కూడ అరసి, తెనుఁగు నుడులకు వీలగు నంతవఱకు వ్యుత్పత్తి చూపింప పట్టుపట్టిరి. అప్పటి నుండియు తెనుఁగు తల్లి పెంపు సొంపులు వెల్లడించుటకే వీరు ఎడతెగక పాటుపడుచున్నారు. సంస్కృత పక్షపాతమునకు లోనై, మనవారు పలువురు తెనుఁగును కొఱవడఁ జేయుట, కవిగారికి సైరింప రాని దైనది; దానినిగూర్చి యిట్లు వ్రాసిరి :

“ప్రాకృతము సంస్కృతంబును ప్రకృతు లనిరి ;
అకట! తెనుఁ గన్ననో వాని వికృతి అనిరి ;
ఎన్ని వ్రాఁతలు చూచిన ఇదియె నిగ్గు ;
తెనుఁగునకు బానిసతనంబు తెచ్చి యిడిరి.
తెనుఁగు వికృతి అంచును కొంద ఱనఁ అరయక,
కనక మఱి కొంద ఱది ఒప్పుకొనెద రహహ!
ఎంద ఱటు లన్న, మఱి దాని కెంద ఱియ్య
కొనిన, అందుల కే నియ్యకొన రవంత.
సంస్కృతము మహా భాషయై చనును గాక!
ప్రాకృతము గొప్ప బాసయై పరఁగుఁ గాక!
తెనుఁగు వానికి వికృతి అం చనుట ఎట్లు,
తానుఁ ఒక నాటి పలుకయి తనరు నపుడు?
తెనుఁగు నుడితీర్పు సంస్కృతమున నె మొదటఁ
పుట్టె; కలుగునె ఎందైనఁ ఇట్టి వింత?
అద్ది తన కర్తకున్ సంస్కృ తాభిమాన
మెంతో హెచ్చని తేటగా ఎఱుకపఱుచు.”

తెలుఁగు పొలుపు వెల్లడింప వీరు వైశాఖ సంచికలో వ్రాసిన 'తెనుఁగు–తోఁబుట్టువులు' అను వ్యాసము తెనుఁగువా రెల్లరును పరికింపఁ దగినది. *

కవిగారి వ్రాఁతలఁ గూర్చి మున్నంగి...శర్మగారు 'భావశబలత'లో తెలిపిన మాటలు అక్కరాల నిక్కువములు.—

“ప్రాచీన సంప్రదాయము నెడ భక్తి విఱుగదు. అర్వాచీన సంస్కారము నెడ రక్తియు తఱుగదు. ఆ భక్తికి ఈ రక్తికి

* దీనిని గూర్చి 'భారతి' మనవి మాటలలో ఇట్లు ప్రశంసించినది—

యుక్తి ఘటించినాఁడు. 'రసాత్మకం కావ్య'మ్మనిన గుట్టు పట్టినాఁడు. పట్టినదానినిఁ గైతలోఁ జూపెట్టినాఁడు. సొంత తెలివు సొంత పుంతనుంచి నడపించినాఁడు గాని ఎగవుబేరమున కెగఁబడఁడు. రసలుబ్ధుఁ డనిపించుకొన్నాఁడు. దేశమునకన్న మున్న భాషకుఁ బరాధీనత పాయవలయు నన్నాఁడు."

పండిత పూజనమను శీర్షికతో భారతి వ్రాసినది కూడ ఇట తెలుపఁ దగినది.——

"వీరు కవి, తేనె లాలికింప గలరు; పండితుడు; పలుకుల పొలకువల తెలియగలరు. దగ్గరబాసలతో, దూరపు బాసలతో తెనుగునకు గల చుట్టరికమును పోల్చి చూచి తెలుగు మేలిమిని వీరు తెలిసికొనినారు. తెలుగు పుట్టువును వెలిపెట్టగల నిఘంటువును రచియింప తలపెట్టి యున్నారు. అట్లే వ్యాకరణమును రచియింప మొదలిడినారు. ఇవి రెండును తెనుగు బాసకు, తెనుగువారికి నేడు-క్రొత్త పాతల కలయిక కాలమున-పరమావశ్యకములు."

వ్యాకరణము వ్రాయఁ బూనుకొని నపుడే కవిగారు తెనుఁగు నిఘంటువు కూడ వ్రాయుటకు తలపెట్టిరి.

అంతలో 'సాహిత్య పరిషత్తు' వారు, సూర్యారాయాంధ్ర నిఘంటువు, తయారు చేయఁ గడఁగుచున్నారని విని, ఆ కడంక తాము అపుడు విడిచిపెట్టినారు. కాని,

"శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రులుగారు బహు గ్రంథములు చూచి దీనిని రచియించినారు. వీరు 'తాము తెలుపఁదలఁచు విషయము చదువువారి మదిని కుదురుగా నాటునటుల చేయఁ జాలు' శైలి నలవఱచుకొనిన నిపుణులు...... ఈ వ్యాసము 'వైశాఖి'కి మకుటము; పాఠకుల కగ్రగణ్యము; భాషాచరిత్ర జిజ్ఞాసువుల కెల్ల పరమాదరణీయము." (అంగీరస-భాద్రపదము)

పరిషత్తువారు వెలువఱిచిన నిఘంటువు మచ్చుపదముల పీఠికలో సాధన సామగ్రిచాలమింజేసి ఉత్పత్తి వ్యుత్పత్తులు చూపుయత్నము విరమించినటుల వ్రాయుట చూచి, వీరు అట్టి నిఘంటువువలన తెనుఁగు తల్లి 'మేలి వాఙ్మయము లున్న పలుకు వెలందు లెక్కిన గద్దియలతో సాటివచ్చు గద్దె నెక్కుటకు' వలనుపడదని మది నొచ్చుకొని, విడిచిపెట్టిన 'నుడికడలి'ని తిరిగి కూర్చుటకు నిరుకు చేసికొనిరి. దానికి తెనుఁగు తోఁబుట్టువుల గుట్టుమట్టులే కాక, పలు నాడులలోని పలుకు చెలుల పుట్టు పెంపులు కూడ తెలిసికొనవలె నని ఆ పనికి కడంగుచున్నారు. తెనుఁగునాటియందు ఉసుఱు జిగితో చెలంగుచున్న తెనుఁగు నుడులను కూడఁబెట్టు చున్నారు.

చిన్నతనమునుండియు కవిగారికి కైత కూర్పులో చొరవ హెచ్చు. పిన్ననాఁటనే నాటకములు వ్రాసి, ఆడుచుండినందున వీరిని 'బాలకవి' అని సాంఖ్యాయన శర్మగారు అప్పుడపుడు సగసక్కెము లాడుచుండినటుల తెలియ వచ్చెనఁట! దానికి జవాబుగ కవిగారు ఒకసారి 'విజయ విలాసము' ఆడినపుడు శర్మగారు మొదలగు పండితులను పనిపట్టి పిలిచి.—

"బాల కవిజన విరచిత భవ్యకావ్య
నాటకంబులు మిగుల నానందకరము
లైనగతిఁ ప్రౌఢకవి జనానూన కావ్య
నాటకవితాన మగునె యానందకరము?"

అను పద్దెము చదివి, తమ చౌరవతోడి చదురుతనము చూపిరి.

తఱచుగ పండితులకు, పిల్లకవులను ఈసడించి-పండితులన్న భయపడునట్లు చేయుట, అలవాటు. కాని కవిగారు పిల్ల కవులను బుజ్జగించి, వారికి ఎంతో హెచ్చరిక యిచ్చుచుందురు.—

"ఇపుడు కడు గొప్పగాను వర్ణింపఁ బడెడి
ప్రౌఢ కవులు నొకప్పుడు బాలురు, మఱి
ఊరుఁ పేరును లేనట్టి వారలె సుమి!"

అని తమ 'కుమారాస్త్ర విద్యాసందర్శనమున' వ్రాసిరి.

కవిగారు వట్టి పొత్తములు వ్రాయు వారే కారు; తెనుఁగు తల్లిని బానిసతనపు చెఱ నుండి విడిపించి, ఆమెను సాటిలేని మేటి గద్దెపై నిలిపి, ఇప్పటి పలుకు రాణులలో ఒకరాణిగా రాణింపఁ జేయఁ దలపెట్టిన దిట్ట పలుకు తీర్పరి. ఆమె మన్ననకు రవంత కొఱంత వచ్చినను వీరు సమ్మతింపరు. రవీంద్రనాథ ఠాకూరు గారి 'విశ్వభారతి'లో తక్కిన నాడుల భారతులకుఁ గల మన్నన తెన్నాటి భారతులకు లేమిచే, ౧౯౩౩ డిసెంబరులో 'కవితాసమితి' పక్షమున రవీంద్రుని కిచ్చిన మన్నన కానుక-'నుడిరతనపుచేతి తొడవు'లో ఈ మాట ముదలకించి, తెనుఁగు పలుకు తల్లికి 'విశ్వభారతి'లో పెద్ద ఱికము చేయ వీలు కలిగింపుఁ డని కోరిరి.

తెనుఁగు తల్లిని గద్దె నెక్కించు తలంపుతోనే కవిగారు శ్రీ కలాభిలాషక సమాజమునకు, ఐందవ హితసభకే కాక మఱికొన్ని సారస్వతసంఘములందును ఉండి పని చేయుచున్నారు. అందు మొదటిది కవితాసమితి.

కవితా సమితి.

ఈ సమితిని ౧౯౨౬ వ సంవత్సరము మే ౬ వ తేదిని పురిపండా అప్పలస్వామి, శ్రీరంగం శ్రీనివాసరావు, వడ్డాది సీతా రామాంజనేయులు గార్లు కలసి స్థాపించిరి. ౧౯౨౬-౧౧-౨౦ తేదిని ధర్మాశ్రమములో జరిగిన సమితి మొదటి సమావేశములో కవిగారిని అధ్యక్షులుగాను, కీ. శే. భమిడిపాటి చినయజ్ఞ నారాయణ శర్మగారిని ఉపాధ్యక్షులుగాను, పురిపండా అప్పలస్వామిగారిని కార్యదర్శిగాను, సబ్నివీసు సత్య కేశవ రావుగారిని కోశాధిపతిగాను సమితివారెన్నుకొనిరి. ౧౯౩౩ అక్టోబరులో జరిగిన వార్షికోత్సవమున, సమితి కవిగారిని స్థాయి సంఘాధ్యక్షునిగా ఎన్నుకొనె. వీరి అధ్యక్షత క్రింద సమితి దిన దినాభివృద్ధి గాంచుచున్నది. సమితిలో సుమారు నలువది అయిదుగురు సభ్యులు—సాంఖ్యాయన శర్మ, కేతవరపు వేంకట శాస్త్రి, పరవస్తు లక్ష్మీ నరసింహ స్వామి, నిరోగి రామశాస్త్రి వంటి పండితులు; పురిపండా అప్పలస్వామి, శ్రీరంగం శ్రీనివాసరావు, పూడిపెద్ది వేంకట రమణయ్య, తురగా వేంకట రామయ్య, అధికార్ల సూర్యనారాయణరావు వంటి భావ కవులు;



కవితాసమితి స్థాపకులు.

పురిపండా అప్పలస్వామిగారు.

శ్రీరంగం శ్రీనివాసరావుగారు.

వడ్డాది సీతారామాంజనేయులుగారు.

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు, గొడవర్తి రామదాసు వంటి వాఙ్మయ పరిశోధకులు; తాపీ ధర్మారావు, సెట్టి లక్ష్మీ నరసింహము వంటి ప్రబంధకవులు; ఇంకను పలుశాఖలకు చెందిన రచయితలు కలరు. 'కవితాసమితి గ్రంథావళి' పేర కొన్ని గ్రంథములు వెలువడినవి. రెండు వార్షిక సంచికలు పైకి వచ్చినవి. అందు వైశాఖ సంచిక మంచిపేరు గడించుకొన్నది. ౧౯33 సంవత్సరము మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అధ్యక్షత క్రింద సమితి జరిపిన 'ఆంధ్రకవుల ఛాయా చిత్ర ప్రదర్శనము' తెనుఁగు తల్లి కొక క్రొత్తసిరి చేకూర్చినది. చరిత్ర కెక్కవలసిన-ఆ యింపు నింపు చిత్తరువు పేరోలగపు సొంపు చూపఱ కెప్పటికిని మఱపునకు రానిది. ఆనాఁడే గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారి పెద్దఱికమున జరిగిన వార్షికోత్సవమును, చిత్ర ప్రదర్శనమును, గ్రంథ ప్రదర్శనమును చూచిన వారికి, అది అపురూప మయిన కవుల పండుగవలె కన్పట్టినది. 'కవితా సమితి గ్రంథాలయ' మను పేరిట ఒక గ్రంథాలయము కూడ ఇపుడు ధర్మాశ్రమమున నున్నది. కవితా సమితి పక్షముననే మేలి తెనుఁగు నిఘంటువు కవిగారిపుడు తయారు చేయుచున్నారు.

ఆంధ్రావలిసమాజము.

ఎలమంచిలిలో ౧౯3౦ సంవత్సరమున గొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారి ప్రోత్సాహమున వెలసిన—ఆంధ్రావలి సమాజమువారు కవి గారిని అధ్యక్షునిగా ఎన్నుకొనిరి

ఈ సమాజము "ఆంధ్రావలి మోదముంబొరయు" నట్లు 'ఆంధ్రావలి గ్రంథమాలిక' అను పేర ముఖ్యముగా విజ్ఞాన విషయములను జన సామాన్యమునకందించుటకు నెలకొనినది. ఇది ఇప్పటికి కొన్ని గ్రంథములను వెలువఱచినది.

భారత భాషా సమితి.

దొరతనమువారు మొదటిసారి ౧౯౩౦ లో తమ్ము నిర్బంధించి, వెల్లూరు చెఱసాల కంపినపుడు, తెన్వంగడపు పలుకులు నేర్చుకొనుచు వలయువారికి తెనుఁగు నేర్పుచు తోడి పెఱపలుకు పండితులతో నెయ్యము కుదుర్చుకొని వారిని ఇయ్యకొలిపి, అక్కడనే కవిగారు 'భారతభాషా సమితి'ని స్థాపించిరి. భారత దేశములోని పలు పలుకుల పండితులను ఇందు సభ్యులుగా కైకొందురు. పై పలుకుల పొలకువలు తెలిపి "తెనుఁగు తల్లి కై సేఁతకు తగిన పస సమకూర్ప సాయపడు"నని కవిగారు ఈ సమితిని ఏర్పఱచిరి. ఇందు వీరుకాక, తిరుకూట సుందరము పిళ్లైగారు, ఎమ్. ఏ., బి. ఎల్., (తమిళము), పనియాడిగారు, (తుళువము), ఉ. గోపాల మీనన్ గారు, బి. ఏ., బి. ఎల్., (మలయాళము), హరిహర శర్మగారు (హిందీ) మొదలగువారు సభ్యులు. దీని పని కొంత జరిగినది. ఇఁక ముందు ఎంతో జరగవలసి యున్నది.

తెనుఁగు గుడి.

తమ పెద్దతికము క్రింద నున్న 'పలుకు పనియార ము'లన్నియు కలిపి, కవిగారు ౧౯౩౩ లో తెనుఁగు గుడి నెలకొల్పిరి. వీరును వీరి తోడివారును తెనుఁగు తల్లి కైసేఁతకు చేరి, పని చేయు పట్టే 'తెనుఁగు గుడి.' ఇది ఇపుడు ఎలమంచిలిలోను, విశాఖ పట్టణములోను, బెజవాడలోను పని చేయు చున్నది. ఎలమంచిలిలో తెనుఁగు గుడికి 'మనికి పట్టు' గా, గొబ్బూరు వేంకటానంద రాఘవరావు గారు కొంత నేల కవిగారి కిచ్చిరి. బెజవాడలో ఖద్దరు సంస్థాన నియంతలగు ఉప్పలూరి వేంకట కృష్ణయ్యగారు తమ యింటిలో తెనుఁగు గుడికి తావిచ్చిరి.

సన్మానము

"ఏశుభముహూర్తమున, ఏయమృతవాక్కున వెలువడెనోకాని కవిగారి వాసి గంజాము, విశాఖపట్టణమండలముల కెగఁబ్రాఁకి, కోనసీమవెంట గోదావరి దాఁటి వేఁగి సీమచేరినది. కృష్ణాతటము గడచి కొండవీటిసీమఁ బడి, నల్లమలఁజొచ్చి, రేనాటివఱకుఁజాటినది." కృష్ణాజిల్లాలో పుట్టి, గోదావరి జిల్లాలో కొంతవఱకు పెరిఁగినను, హెచ్చు ఉనికి చేతను, కొలువు చేతను, మఱి కొన్ని కతముల చేతను వీరు విశాఖ పట్టణము జిల్లా వారే అయిరి. అందువలన ౧౯౩౩ సెప్టెంబరులో ఈ జిల్లాప్రజలు వీరిని సన్మానించి, రు ౧,౧౧౬ లు సమర్పించిరి. ఈ సన్మానమునకు విన్నకోట దుర్గారావు శ్రేష్ఠిగారు కార్యదర్శిగ

నుండి, జిల్లాలో సొమ్ము వసూలుచేసిరి. సన్మానసభకు భూపతిరాజు వేంకటపతి రాజుగారు అధ్యక్షత వహించిరి. ఆనాఁటి సన్మానసభకు తొంబదియేండ్ల కవిగారి తండ్రిగారు-శ్రీరాములుగారు కూడ విచ్చేసి, వేదిక నలంకరించి, తమ ఏఁబది తొమ్మిదేండ్ల కుమారుని సన్మానము కన్నులార చూచి, దీవించిరి. కవిగారికి ప్రజలు దుస్సేలులు కప్పిరి; పద్య రత్నములు సమర్పించిరి. విప్రులు వేద మంత్రములతో ఆశీర్వదించిరి. సహృదయులు సంతసించిరి. కవిగారు 'వాడని దీవనపూవులు'* కానుకగా ఇచ్చి, తమ మేలు మఱవమిని చూపిరి.

---

* వాడని దీవన పూవుల లోనివి కొన్ని పద్దెములు—

" గీ. ఎప్పు డెయ్యది వలయునో అప్పు డద్ది
ఎలమి సమకూర్చి నను( గాచు-ఎల్ల ఱేఁడు
ఇపుడు నన్ను మన్నించిన యెల్ల వారిఁ
కలిమి చేకూర్చి ఎప్పుడున్ గాచుఁ గాక !.

మ. రసిక గ్రామణి, విన్నకోటమణి, దుర్గారావుగా, రీశ్వరుం
డసమప్రీతిని ప్రోత్సహించుటనె, అత్యంతాభిమానాప్తిఁ నా
బస కేతెంచి, ఎఱుంగఁజేసి, ఇటు సంభావింప ఏర్పర్చి; రె
ల్ల సిరుల్ చేర్చి, అలర్చి, ఈసుజనుఁ ఎల్లం డోముఁ ఎల్లప్పుడున్.

ఉ. నెచ్చెలులార ! మీ రిపుడు నెయ్యము మీఱఁగఁ చేసినట్టి మే
లిచ్చఁదలంచుకొంచు, మిము ఎప్పుడుఁ కోరినకోర్కులన్నియున్
మచ్చికఁదీర్చి, సంపదలు-మన్నన-కీర్తి-చిరాయు-విచ్చుచున్
నిచ్చలుఁ, బ్రోవఁ ఈశ్వరుని నెమ్మది వేఁడుచునుందుఁ గూర్మిమై.

## షష్టిపూర్తి మహోత్సవము

కవిగారికి, భావాశ్వయుజ బహుళ దశమి నాఁటికి అఱువదేండ్లు పూర్తి అయినవి. 'తెనుఁగు నాడు' ఈ తెనుఁగుకొలుఁవుకాని అఱువదేండ్ల పండుగ చేసి, మన్నింప నిశ్చయించినది.

ఈ క్రింది తెనుఁగు పెద్దలతో షష్టిపూర్తి మహోత్సవ సంఘము ఏర్పడినది—

| అధ్యక్షులు | సభ్యులు |
|---|---|
| భూపతిరాజు వేంకటపతిరాజు | సర్-సర్వేపల్లి రాధాకృష్ణయ్య |
| **ఉపాధ్యక్షులు** | గిడుగు వేంకటరామమూర్తి |
| కాశీనాథుని నాగేశ్వరరావు | అయ్యదేవర కాళేశ్వరరావు |
| తెన్నేటి విశ్వనాథము | చిలుకూరి నారాయణరావు |
| **కోశాధిపతి** | పూడిపెద్ది సూర్యనారాయణ రావు |
| సబ్నవీసు సత్యకేశవరావు | పింగళి నాగేంద్రరావు |
| **కార్యదర్శులు** | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి |
| భమిడిపాటి చినయజ్ఞనారాయణశర్మ | పూసపాటి లక్ష్మీనరసింహరాజు |
| గొబ్బూరు వెంకటానంద రాఘవరావు | పాలకోడేటి గురుమూర్తి |
| ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ | మండ సుబ్బారావు |
| పురిపండా అప్పలస్వామి | మున్నంగి లక్ష్మీనరసింహశర్మ |
| | అడవి బాపిరాజు |

---

గీ. ఇటుల దీవన పూలిచ్చుఁ ఎల్ల రేఁడు
తన్ను మన్నించు-గుహుని పత్తనపువార
లకును, తన్మండలపు వారలకును మేలొ
సంగఁ గోరుచు మా. రామచంద్రశాస్త్రి."

తల్లావఝుల శివశంకరశాస్త్రి
చిలకమర్తి లక్ష్మీనరసింహము
గన్నవరపు సుబ్బరామయ్య
విన్నకోట దుర్గారావు
ఉన్నవ లక్ష్మీనారాయణ
మంగిపూడి వేంకటశర్మ
వసంతరావు బుచ్చిసుందర రావు
దిగుమర్తి వేంకటరామస్వామి
దిగుమర్తి జానకీబాయమ్మ
పూసపాటి బుచ్చిసీతారామచంద్రరాజు
అడిదము రామారావు
చేకుమళ్ల కామేశ్వరరావు
జనమంచి శేషాద్రిశర్మ
మల్లాది రామకృష్ణశాస్త్రి
స్థానం నరసింహారావు
వరహాగిరి వేంకటజోగయ్య
దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ
వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి
కొండ వేంకటప్పయ్య
తెలికిచర్ల వేంకటరత్నము
కొమ్మిరెడ్డి సూర్యనారాయణ మూర్తి
కిళాంబి వేంకటరంగాచార్యులు
కవికొండల వేంకటరావు
కొల్లూరు సూర్యనారాయణ గుప్త
మానవల్లి రామకృష్ణకవి
మల్లంపల్లి సోమశేఖరశర్మ
మండపాక పార్వతీశ్వరశాస్త్రి
బులుసు సాంబమూర్తి
ముట్నూరి కృష్ణారావు
కూచి నరసింహము
తాడిపర్తి రాఘవాచార్యులు
గుంటూరు వేంకటసుబ్బారావు
ఉమర్ ఆలీషాకవి
యమ్మాడ హనుమంతరావు
కవితాసమితి
ఆంధ్రావళి సమాజము

చోడవరములోను, ఎలమంచిలిలోను, కనకవల్లిలోను ఉపసంఘములు కూడ ఏర్పడినవి.

ఇపుడు విశాఖ పట్టణమున ఈ 'అఱువదేండ్ల పండుగ' జరుగుచున్నది; మల్లాది శివరామశాస్త్రిగారు తమ 'రాజ్యాంగ కరదీపిక' కృతిని, కొడవంటి బ్రహ్మాజీరావుగారు తమ 'శిలువ' నాటకమును, కవిగారికి అంకిత మిత్తురు. కవులు పద్దెపురతనములు కానుక లిడుదురు.

మంది తమ మేలు మఱవమిని వెల్లడింతురు. కవిగారి కథారత్నాకరము - అవతార కథలును - ౧,౧౧౬, ఈ మనుగడయు - ౧,౦౦౦, షష్టి పూర్తి ప్రకటనములుగా మహోత్సవ సంఘమువారు వెలువఱించి, అవి కవిగారికి సమర్పించి, బహూకరింతురు.

తెనుఁగునాటి చరిత్రలో ఈ నాఁడు 'పండుగు' గా ఎన్నఁదగినది.

కవిగారి షష్టి పూర్తి మహోత్సవముం గూర్చి తెనుఁగునాటి పెద్దలు కొందఱు తెల్పిన మేల్పలుకులు ఇచట పొందుపఱుపఁ దగును:—

గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు

"మన కవిగారి వలె, స్వార్థము త్యజించి పరార్థము సాధించేవారు అరుదు. వారిని నేను బాగా ఎరుగుదును; ఇచ్చకాలకు అన్న బొల్లిమాట కాదు. అట్టివారిని కృతజ్ఞతతో పూజించడము సంఘమునకు విహిత ధర్మము; ఆ ధర్మము నెరవేర్చుటకు ఇపుడు అనుకూలముగానే ఉన్నది."

గన్నవరపు సుబ్బరామయ్య గారు

"శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారికి షష్టి పూర్తి మహోత్సవమును జరుప తలపెట్టిన వారి నందర నభినందించు చున్నాను."

కూచి నరసింహము గారు

"శ్రీ రామచంద్ర కవిగారు గౌరవ పాత్రులగు నామిత్రులలో నొకరు. అట్టి పూజ్యుల గౌరవించుట నాకెంతయు సంతోషకరము."

## జనమంచి శేషాద్రి శర్మగారు

"శ్రీ కవిగారు నాకు గురు తుల్యులు. సకల సద్గుణా కరులగు వారి షష్టిపూర్తి మహోత్సవము సందర్శించు భాగ్యము కలుగునా అని యువ్విళ్లూరుచున్నాను."

## డాక్టరు-చిలుకూరి నారాయణ రావుగారు

"అట్టి దేశభక్తాగ్రేసరుని గౌరవించడము మనల మనము గౌరవించు కొనడమే."

## మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

"శ్రీ కవిగారిది మన కందరకూ ఆదర్శ ప్రాయ మయిన జీవితం. వారిని మన మెంత గౌరవించినా కొండంత దేవునికి ఒక పుష్పం సమర్పించిన ప్రాయమే అయి ఇంకా తక్కువే అవుతుందని నా అభిప్రాయం. అయినప్పటికీ ఆ ఒక్క పుష్ప సమర్పణానికి భక్తిలో ఆయనంత ఎత్తూ ఎదుగుతామనే నా విశ్వాసం. శ్రీ కవిగారికి, వారి షష్టి పూర్తి మహోత్సవం జరపదలచిన ఇతర మిత్రులకు అభినందనాలు."

## వావిళ్ల వేంకటేశ్వరులు గారు

"శ్రీ కవిగారు అన్ని విధముల సన్మానార్హులని చెప్పుట అనవసరము"

## శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

"కవిగారికి షష్టిపూర్తి మహోత్సవం చెయ్యడం అంటే, ఆంధ్ర వాఙ్మయానికి మనం చేసిన అరవైయేళ్ల దోహదాన్ని చరిత్రలో వివరించడం అన్న మాట. ఇది చాలా అవసరమైన కార్యం."

### వివాహము—కుటుంబము

కవిగారు ౧౯౦౩ లో మేనమామ-చిలుకూరి వేంకటసుబ్బయ్యగారి కూఁతురు శారదాంబను పిడపర్తిలో



కవిగారి జనకులు - శ్రీరాములు గారు.

వివాహ మాడిరి. ౧౯౧౨ సంవత్సరములో కలిగిన మొదటి బిడ్డఁడు నెల లోపుననే చనిపోయెను. ౧౯౧౬ లో పుట్టిన సుబ్బరామ శాస్త్రి ఒక్కఁడే వీరి కాన్పు. తండ్రి గారు సేమముగా ఉన్నారు. వీరి చెల్లెలును, ముగ్గురు తమ్ములును కృష్ణా జిల్లాలోను, నిజాము రాష్ట్రములోను తమ తమ కుటుంబములతో గౌరవముగా కాఁపురము చేయుచున్నారు. కవిగారు గృహస్థాశ్రమమున ఉన్నప్పటికిని, పీలగునంతవఱకు వానప్రస్థ సన్యాసాశ్రమములను పాటించుచు—'గృహస్థ సన్యాసి' నని అప్పు డప్పుడు చెప్పుచుందురు. కుటుంబ వ్యవహారములలో ఎన్నో విషయములందు వీరు 'టాల్‌స్టాయ్' వలె మెలఁగు చుందురు.

## ముగింపు

ఈ మనుగడ ముగించుటకు ముందు కవిగారి రూప గుణాదులఁ గూర్చి కొంచెము ముచ్చటింప నగు:

"ప్రశాంతమైన చూపూ బ్రహ్మతేజస్సు తొణికిసలాడుతూవున్న వదనమూ కలిగి స్వచ్ఛమైన ముదుక గుడ్డలతో, తల మీఁద గొడుగుగాని, కాళ్ళకు చెప్పులుగాని లేకుండా నడి వీధిని నడిచి పోతూ వుంటే వేలకొలది కండ్లను ఆకర్షిస్తాడాయన—మా రేపల్లి రామచంద్రశాస్త్రిగారు.

మహారాజులకు సైతం చూపని భక్తి వినయాలు ప్రదర్శిస్తారు ప్రజలు. చుట్టలు, సిగరెట్లు కాలుస్తూ,

తుదకు తమ్ములం నోటితో కూడా ఆయన ఎదుట పడ డానికి సందేహిస్తారు. అపరిచితులుకూడా ఆ మూర్తిని చూచి చేతులు జోడిస్తారు.

ఎంతటి కష్టాలలోనూ మందహాసం తొలగిపోదా యన పెదవులనుండి. కష్టాలలో దుఃఖించడమంటే ఎరుగనే ఎరుగరు శాస్త్రిగారు. స్వచ్ఛమైన వీరి మనుగడను గమనించి ఉపదేశాలను గ్రహించి ఎందరో మంచి ప్రవర్తనను అలవరచుకొన్నారు." *

ఈయన "దైన్య మెఱుఁగఁడు; దారి మొఱుఁగఁడు; ప్రజ్ఞదాఁచుఁగఁడు; ప్రసన్నతఁ దఱుగఁడు. పాడి కై ప్రాపు బలి పెట్టుగాని, ప్రాపు ప్రోపులకై పాడిఁ దెగఁ దీయఁడు. ధర్మానుగతమగు కర్మశీలుఁడు. ధర్మ శీలత పొత్తుబాయని కార్యశూరుఁడు. సార్వభౌమునైన శాసింపఁగల సమ్యగ్భావుఁడు—సాధుశీలుఁడు. పుచ్చు కొన్నను ఇచ్చినను ఒకటే ఉల్లాసము. ప్రభుని సరసను, పాకి వాని దండను ఒక్కటే సంతుష్టి.

దయాసారము వహించినను దాష్ట్యమును సహింపఁడు. అంతఃకరణము ప్రమాణముగ నెంచునే కాని, ఆప్తుల కేని మోమోడి ఆచరింపఁడు. సుష్టుగా భోజనముఁ గోరఁడు. బ్రతుకుటకుఁ బట్టెడు మెతుకులు; మానమునకు బారెడు బట్ట. ఇవి జీవనమునకు

---

* పురిపండా అప్పలస్వామిగారి ప్రబుద్ధాంధ్రలోని వ్యాసము.

వలయునవి. పస్తుండియు భక్ష్యభోజ్యముల నారగించి నంత తుష్టి; గులకరాలఁ బండియు, గుట్టుకొట్టి నిద్ర బడయువాఁడు. మనుగడ నెల్ల ప్రకృతి జననికి మీఁదు గట్టినాఁడు. కోటిలో నొక్కఁడుగ లెక్కింప వలయు వాఁడు. ఋషికల్పుఁడు." *

మంచి నడతయే వీరికి అన్నిటి కన్న మిన్న. † రాజయినను, రైతయినను, నడతను బట్టియే వీరి యెన్నికలో గొప్పవాఁడు. నడత సరియైనది కాన పుడు ఎంతటి వారి నైనను, వీరు తెగడుటకు వెను దీయరు. వీరు కాలేజీ పండితులుగా ఉన్న దినములలో ఒకనాఁడు ప్రిన్సిపాలు-అయ్యంగారును వీరును ఒక గదిలో కూర్చుండి యుండఁగా, థియాసఫిష్టులగు అయ్యంగారి మెప్పును పొందుటకై తోడి ఉపాధ్యాయు లొకరు వచ్చి కవిగారిని "థియాసఫిష్టు కండి" అని కోరిరి. "ఏఫిష్టు అయిన నేమి? నడత తిన్నగా ఉండవలె"

---

* మున్నంగి.....శర్మగారి భారతిలోని వ్యాసము.

† బాల్యము నుండి మంచి నడవడిక అలవఱచుకొనుటకు ఎల్ల వారును విడిచిపెట్ట వలసిన చెడు అలవాటులను కవిగారు పట్టిక గా ఇచ్చియుండిరి. అవి ఇట జాబితాగా వివరించుచున్నాను—

పిన్న పెద్దల దురభ్యాసములు

ప్రేళ్ళు నోటఁ బెట్టుకొనుట; మన్ను, కచ్చిక, విబూది, సుద్ద, మొదలగునవి తినుట; చిఱుతిండ్లు తినుట; మందులు తినుట; ఎక్కడ పడితే అక్కడ—౧-కి ౨-కి వెళ్ళుట; క్రింద దేకుట; ఉమియుట; క్రకక్కుట; చీమిడి మొ॥ గోడలకు, స్తంభములకు

అని అధికారి అనినైనను జంకక అయ్యంగారి నుద్దేశించి వీరు ఎత్తిపొడిచిరి. ఇట్టివి పెక్కులు వీరి మనుగడలో ఉదహరింప వచ్చును. మంచి నడతయే మానిసికి 'నగ' కాని, తక్కినవి కావు:—

---

రాచుట; ఒంటికి, బట్టలకు రాచుకొనుట; చుట్టలు, సిగరెట్లు, బీడీలు మొ॥ కాల్చుట; తాంబూలము, కచ్చేరీ తాంబూలము, కిళ్లీలు, మాదుము, నల్లమందు వేయుట; పొడుము పీల్చుట; కల్లు, సారా, బంగు మొ॥ త్రాగుట; ఇవి నేర్పుట; తిట్టుట; బూతు లాడుట; కేకలు వేయుట; ఇచ్చకము లాడుట; కాఱు లాడుట; గుసగుస లాడుట; మెట్ట వేదాంతములు చెప్పుట; అడిగిన దానికి మాఱు చెప్పకుండుట; పిలువని దానిని గూర్చి మాటలాడుట; కల్లలాడుట; చాడీలు చెప్పుట; చెడ్డ వాండ్రతో అక్కఱమాలిన వాగుడు; ఉసుఱుచు చదువుట; దొంగ సాక్ష్యములు చెప్పుట; దొంగవ్రాఁతలు వ్రాయుట; దొంగ కొలఁతలు కొల్చుట; దొంగతూనికలు వేయుట; కల్తీలు కలుపుట; దొంగ ఆత్మస్తుతి, పరస్తుతి; రహస్యములు బయల్పెట్టుకొనుట; త్రిప్పుట; రిత్త హెచ్చు బాతాఖానీ; వెఱ్ఱివేషములు వేయుట; భావము తెలియక చదువుట; చదు వెగవేయుట; చెప్పినది వినక వ్రాసినది చూడక మరల అడుగుట; తల్లిదండ్రులను, అయ్యవార్లను, పెద్దలను, దైవమును నిందించుట; ఏడ్చుచుండుట; ముక్కుచు మూల్గుచు గొణగుచుండుట; మారాము చేయుట; దుమదుమ లాడుచుండుట; పొరపాట్లు చేయుచుండుట; వెఱ్ఱిపట్లు పట్టుట; అవి చేయలేక తపించుట; జమా ఖర్చు లెప్పటి కప్పుడు వ్రాసికొనక కొట్టుమిట్టాడుట; ఆత్మనింద, పరనింద; కొట్టుట; గిల్లుట; అఱుకుట; రాలు విసరుట; తన్నుట; దెబ్బలాడుట; తూనీఁగలు మొదలగు వాని బాధపెట్టుట; తోడివారిని పడఁద్రోయుట; కిత కితలు పెట్టుట; వెక్కిరించుట; అవమా

" పుట్టినప్పుడే నగలును, బట్టలుండు ?
పిదప తాల్తుము ; విడుతుము ; వెలయ వెపుడు ;

నించుట ; వేఁట, జంతు హింస, నరహత్యలు చేయుట ; దానికి తోడ్పడుట ; చదువుమీఁదను, వ్రాఁతమీఁదను దృష్టి ఉంచక దిక్కులు చూచుట ; పని వదలి మాటిమాటికి లేచి పోవుట ; దిక్కులుచూచుచు నడుచుట; రాచుకొనిపోవుట ; గోళ్ళుకొఱుకు కొనుచుండుట ; నలుగురిలో బట్ట యెత్తి గోఁకుకొనుట ; వెకిలి నవ్వులు నవ్వుట ; దేవిరించుట ; దొంగిలించుట ; కొనుమన్నదాని లోనిది, దాఁచుకొన్నది కాఁజేయుట ; పుస్తకములు చూచి చెప్పించుకొని, కాపీ కొట్టి పరీక్షలో నెగ్గుట ; దూబరాఖర్చు చేయుట ; బడి ఎగవేసి తిరుగుట ; బడికి వేళకు వెళ్ళకుండుట ; ఆటలక్రింద హెచ్చు వేళ పాడుచేయుట ; ప్రొద్దెక్కి లేచుట ; పట్టపగలు పండుకొనుట; రాత్రి మేల్కొని ఉండుట; పరస్త్రీల నెగదిగఁ జూచుట ; ఆడరాని మాటలాడుట ; చెఱ పట్టుట ; శరీరబలము, సంతాన శక్తి పోవు పాడు పనులు చేయుట ; అతి సంభోగము ; భార్యల నాదరింపకుండుట ; అన్యాయముగా పరుల సొత్తు తీసికొనుట ; కట్నములు కానుకలు కోరుట ; లంచములు పుచ్చుకొనుట; నీటిలో ౧-కి ౨-కి వెళ్ళుట ; చోరీలు, బందిపోట్లు చేయించుట ; కనఁబడిన ప్రతి విదేశ వస్తువు కొనుట ; పేకాట నాటకము మొదలగు వానివలన నిద్ర మానుట ; ఇండ్లు, కుప్పలు మొ॥ కాల్పించుట ; పై వారి బాధలు చూచి సంతోషించుట ; పై వారు మంచి స్థితిలోనికి రాకుండు ప్రయత్నములు చేయు చుండుట; పైకి మంచిగా ఉన్నట్లే ఉండి లోపల గోతులు తీయు చుండుట ; చేయవలసిన పనులు, నిశ్చయించుకొన్న పనులు చేయ కుండుట ; గొంతెమ్మ కోరికలు కోరుచు వగచుచుండుట ; వస్తువులు ఏదో చోట ఏర్పాటుగా ఉంచకుండుట ; సర్దినవే సర్దుట ; అదనుకు పనిచేయక జాగు చేయుచుండుట ; అరువులు, ఎరవులు తెచ్చుట ; చెడుగులతోడి పొత్తు.

ఇట్టి వానికై వగ పేల? ఇంక, మంచి
నడతనగ పోయిన వగవ వలయుఁ గాక!."

అని వీరి ఉపదేశము.

పైని తెలిపి నటుల కడగండ్లకు కన్నీరు నింపని మానిసి కవిగారు. వీరి తొలికొడుకు ౧౯౧౧ లో చని పోయినపుడు వీరు బడిలో నుండిరి. ఇంటి దగ్గఱనుండి కబురు వచ్చెను. కబురు తెచ్చినతఁడు దుఃఖముతో ఉక్కిరి బిక్కిరి యగుచుండెను. కాని కవిగారు నవ్విరి. పిదప చేయవలసిన పని చేసిరి. ఇట్టి నిబ్బరము చూప వలె ననియే, తమ ధీర హరిశ్చంద్రములో, లోహితా స్యుఁడు చనిపోయి నపుడు—

"కాలము చెల్లె పుత్రునకు; కావున ఎంత తపించినన్ వృథా;
కాలము లోఁగఁజేసికొనఁగాఁ గలవా రెవ రెందు లేరుగా;
జాల మిఁకేల? ముందుపని సాగఁగనీ;"

అని హరిశ్చంద్రునిచే చంద్రమతితో వీరు చెప్పించిరి.

మచ్చలేని నడవడిక వలననే కవిగారు దవ్వుల నున్నవారికిని కూడ గురుప్రాయులైరి. సంస్కర్త లును, హరిజనోద్ధారకులును అగు వేపా భీమశంకరము గారు ఒక ఉత్తరములో వ్రాసిన వాక్యములు పరి కింపుఁడు—

"వారివద్ద విద్యాభ్యాసము చేసిన శిష్యుడను గా కున్నను ముప్పది సంవత్సరముల క్రిందట, వారు కారణాంతరమున ఈ గ్రామము (చోడవరము) వచ్చి, నా కతిథులుగా నుండి, నా కెంతో హితబోధ చేసి, లోకోపకార కార్యములలో

నా కమిత ప్రోత్సాహ మిచ్చి, నా యూహాలు క్రియారూపము తాల్చునట్లు, ఆశీర్వాదములతో తోడ్పడినారు. జ్ఞానోపదేశము చేసిన గురువుగా ఆనాటినుండియు నమ్మకొంటిని.''

ఒక సహృదయుఁడు ఇట్లు వ్రాసెను—

''ప్రజ్ఞావంతు లగుటచేత వెలకు మించిన నడవడిక అలవఱచు కొనిరి. దీనికితోడు నైతిక ధీరత్వముకూడ అబ్బె. కావున నన్ను ఆకర్షించిరి.''

ఈ పట్టున నేను స్వయముగ ఎఱిఁగిన ముచ్చట ఒకటి వ్రాయక విడువఁ జాలను. ౧౯౨౧ లో కవిగారును నేనును ఖద్దరుప్రచారము చేయుచు పొట్నూరుగ్రామము వెళ్ళితిమి. ఆ ఊరి పెద్దకరణము—చిట్టూరి నరసింహ మూర్తిగారు, కవిగారు అచ్చటికి వచ్చిరని విని, వీరికడకు వచ్చి, మాతో తమ వృత్తాంతము తెల్పిరి. ఆయన ముప్పదేండ్ల క్రిందట కవిగారి 'తెలుఁగు సంధ్యావందనము' చదివి, అందలి మెఱుఁగులను గుర్తించి, అటుల నడచుటకు నిసుబు చేసికొనిరి. అప్పటి నుండియు, కవిగారినే ఒజ్జగా మదిలో నిలుపుకొనిరి; కవిగారి 'పేరు వ్రాల'ను బట్టి, వారి మూర్తిని మనస్సులో చిత్రించుకొని, తనివి నొందుచుండిరి. ఏకలవ్యునివలె ఆ విధముగ మూర్తిగారు సత్ప్రవర్తనమును, కైత నేర్పును అలవఱచు కొనిరి; రెండు పొత్తములుకూడ వ్రాసిరి. ఎప్పుడయిన కవిగారిని దర్శించి ఆ పొత్తములు వారిచేత దిద్దించు కొనవలె నని తలంచుచుండిరి; కాని వారి ఆరోగ్యము మంచిది కాక పోవుటచే అప్పటి వఱకును అది

వలను పడ లేదు. దైవికముగా ఆయన కోరిక ఫలించెను. గురువే శిష్యునికడ కరుదెంచెను. ఇది వినుసరికి నాకచ్చెరు వయ్యె. కవిగారు నరసింహామూర్తి గారిని నెనరు పల్కులతో ఆదరించి, పొత్తములు సరి చేసి యిచ్చిరి.

కవిగారి పరిచయమువలన ఎందఱో దురభ్యాసములు మానుకొనఁ గలిగిరి. తప్పు దారి పట్టిన వారిని కొందఱను ధర్మాశ్రమమునకు చేర్చి, మంచి దారిలో పెట్టుచుండిరి. అట్టియెడ మిషను పాఠశాలలోని తోడి క్రైస్తవపు టొజ్జ ఒకరు, తుంటరి జట్టును చేర్చుచున్నటుల వీరితో తమ తలంపు తెలిపిరి. అందుపై కవిగారు "క్రీస్తుమతవం మీకు బాగుగా బోధపడినదే?" అని హెచ్చరించిరి.

కవిగారి ఉపదేశము వలన మంచి వారుగ మారి, ఇపుడు దొరతనమువారి కొలువులో నున్న ఒకరు, ఒకసారి కవిగారితో "మీరు నాకొఱకు పాటు పడకున్నచో ఇప్పటికి నేను ఏ 'అండమాను' లో ఉండి యుందునో" అని చెప్పి తమ మేలు మఱవమి చూపిరి.

ఒక పెద్ద యింటి బిడ్డఁడు మద్యపానము వలన, చెడిపోవు చున్నందున తల్లి దండ్రులు నడి రేయి కొట్టి తగిలి వేయఁగా, కవిగారు అతనిని ధర్మాశ్రమమున ఉంచి, ఆ చెగు అలవాటును మాన్పించి, మరల ఇంటికి చేర్చిరి.

కవిగారికి ఉర్దూ, పార్సీ బాసలను నేర్పిన సతారు సాహెబుగారు, తాము చనిపోవుటకు ముందు కవిగారిని ఇంటికి పిలిపించి, తమ ఆలుబిడ్డల సేమ మరయ వలయునని కోరి యుండిరి. ఆయన కొడుకు మదీనీ సాహెబు గారు కవిగారి తోడి పొత్తు వలన నంజుడు తిండి మాని, కాయగూరల తిండియే ఇప్ప టికిని తినుచున్నానని ఈ నడుమనే తెలిపిరి.

ఇట్టిది కవిగారి మంచినడత పలుకుబడి. ధన సంపత్తి లేకపోయినను, గుణసంపత్తి వలననే కవిగారు 'కోటిలో ఒక్కరుగ లెక్కకు వచ్చినారు.' సొమ్ము సంపాదించి తల్లిదండ్రులకు ఆనందము కలిగింప లేక పోయినను—పేరు తెచ్చియు, కనకదుర్గా శ్రీరామ శత కములు అంకిత మిచ్చియు, వారి అప్పు తీర్చుటకు కడంగిరి.

"ధనముచేత తండ్రి ఋణమును తీర్చెడు
కలిమి కాంచ నైతి; కాన, కైత
కలిమిచేతఁ ఒడలుఁ కడఁకయు కూర్చిన
వాని ఋణముఁ దీర్తు; వాసి కూర్తు."

అని తండ్రిగారికి శతకములు వినిపించిరి. పండ్రెండేండ్ల క్రిందట కాలధర్మము పొందిన తల్లిగారిందులకు నోఁచు కొనలేదు.

మహనీయుల మనుగడలు మానవులను మంచి దారిని నడపించును. కవిగారి మనుగడను నా నేర్చి

నటుల సంగ్రహముగ వ్రాసి వారి షష్టిపూర్తి మహో
త్సవమున కందింపఁ గలిగితిని. నా యత్నము కొంచె
మేని సఫల మగునేని ధన్యుఁడను. కవిగారు శతాధిక
జీవులై తెనుఁగు తల్లి కొలువు చేయునట్లు ఎల్లఁ డను
గ్రహింపవలె ననియు, తెనుఁగు బిడ్డలు కవిగారికి తోడ్పడి
వారిపూన్కి నెఱవేఱునట్లు చేయవలె ననియు కోరెదను.

---

## మనుగడలోని కొందఱి వైనము.

**ఆకెళ్ళ సత్యనారాయణగారు.**

కవి; నాటకకర్త; కలాభిలాషక సమాజ సభ్యులలో ఒకరు; ౧౯౩౩ లో పరమపదించిరి; విశాఖపట్టణము.

**ఆకెళ్ళ సూర్యనారాయణగారు.**

దైవభక్తులు; పరోపకారులు; ఎలమంచిలి.

**ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు.**

పండితకవులు; న్యాయవాది; మహామేధావులలో గణింపఁదగిన వ్యక్తి; ౨౮-౭-౩౩ తేదీని స్వర్గస్థులైరి; పార్వతీపురము.

**ఆరుట్ల రామదాసు నాయఁడుగారు.**

భూస్వాములు; ధర్మాశ్రమగృహ యజమానులు; ౧౯౧౮ లో కీర్తిశేషులైరి; విశాఖపట్టణము.

**ఉప్పలూరి వేంకట కృష్ణయ్యగారు.**

ఖాదీసంస్థాన ధర్మకర్త; నియంత; గుణదల-బెజవాడ.

**ఎమ్. రత్నవేలు మొదలియారుగారు.**

పేరెన్నిక గన్న ఛాయాచిత్రగ్రాహకులు; చిత్రకారులు; విశాఖపట్టణము.

**కొల్లూరు సూర్యనారాయణ గుప్తగారు, బి. ఏ.**

న్యాయవాది; దేశభక్తులు; సంస్కర్త; విశాఖపట్టణము.

**గొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారు, బి. ఏ.**

న్యాయవాది; ఖగోళ రహస్య పరిశోధకులు; ఎలమంచిలి.

**చిలుకూరి పూర్ణయ్యగారు.**

కవిగారి బావమఱఁది; కొంతకాలము విశాఖపట్టణ మండల గ్రంథాలయ సంఘ కార్యదర్శి; ౧౯౨౬ జూలైలో విశాఖపట్టణమున కాలధర్మము పొందిరి.

చేవలి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

మిషను హైస్కూలు సంస్కృత పండితులు; ఆయుర్వేద వైద్యులు; ౧౯౨౭ లో స్వర్గస్థులైరి; విశాఖపట్టణము.

చేవలి వేంకటరమణ శర్మగారు.

పించను పోలీసు సబ్-ఇన్స్పెక్టరు; కవిగారి బాల్య స్నేహితులు; కవిగారి పద్యములు వల్లించి వ్యాప్తి కలిగించిరి; చోడవరము.

జొన్నవిత్తుల గురునాథముగారు, బి. ఏ.

ఆంధ్ర మహాజనసభ ఏర్పఱచుటకు పాటుపడిన మొదటి యువకులలో ఒకరు; కొన్నాళ్ళు కురుపాము రాజుగారి అంతరంగిక కార్యదర్శి; గుంటూరు.

తెన్నేటి విశ్వనాథముగారు, ఎమ్. ఏ., బి. ఎల్.

న్యాయవాది; జాతీయ నాయకులు; విశాఖపట్టణము.

దిగుమర్తి వేంకటరామస్వామిగారు, బి.ఏ., బి. బిల్.

దేశభక్తులు; విశాఖపట్టణము.

పి. టి. శ్రీనివాస అయ్యంగారు, ఎమ్. ఏ., ఎల్. టి.

పెక్కేండ్లు విశాఖపట్టణము కాలేజి ప్రిన్సిపాలు; దానికి స్థిరవసతి కూర్చిరి; దేశభాషాభిమాని; మద్రాసు విశ్వవిద్యాలయమున ఇంగ్లీషు పరీక్షాధికారి; చివర అన్నామలే విశ్వవిద్యాలయము హిస్టరీ రీడరు; ౧౯౩౩ లో కీర్తిశేషులైరి.

పురిపండా అప్పలస్వామిగారు.

కవి; కవితా సమితి కార్యదర్శి; దేశారాధకులు; విశాఖపట్టణము.

ప్రక్రియ అప్పన్నశాస్త్రిగారు.

వైదికబృంద శ్రీరామమందిరము, వేద కావ్య పాఠశాలలు స్థాపించిరి; ౧౯౩౩ లో స్వర్గస్థులైరి; విశాఖపట్టణము.

బులుసు రామజోగారావుగారు.

పుట్టుచోటు గజపతినగరము తాలూకా; జగమెఱింగిన వస్తాదు; ఇప్పటి నివాసము చెన్నపట్టణము.

బొడ్డు రామయ్య శ్రేష్ఠిగారు.

వర్తక ప్రముఖులలో ఒకరు; ౧౯౨౭ లో కాలధర్మము పొందిరి; విశాఖపట్టణము;

భమిడిపాటి చినయజ్ఞనారాయణ శర్మగారు.

కవి; నటుఁడు; నాటకకర్త; దేశభక్తులు; ౧౯౩౫ లో స్వర్గస్థులైరి; మాడుగుల.

భూపతిరాజు వేంకటపతిరాజుగారు, సి. ఐ. ఇ.

సుప్రసిద్ధ న్యాయవాదులు; కవిగారి బాల్య మిత్రులలో ఒకరు; విశాఖపట్టణము.

మంతిన ఆదినారాయణ మూర్తిగారు.

తెనుఁగు దేశమున ప్రథమ ప్రజా గ్రంథాలయ స్థాపకులు; గ్రంథకర్త; ౧౯౦౫ లో కీర్తిశేషులైరి; విశాఖపట్టణము.

మల్లిమడుగుల కోదండరామస్వామిగారు.

ఎమ్. ఏ. చదువు విరమించి కాంగ్రెసులో చేరిన దేశారాధకులు; విశాఖపట్టణము- శ్రీకాకుళము.

ముద్దా సోమప్ప శాస్త్రిగారు.

దేశాభిమాని; భాషాభిమాని; హాయరు ఎలిమెంటరీ స్కూలు స్థాపించి, దానికి తమ సర్వస్వము ధారపోసిరి; గ్రంథాలయోద్యమమున అత్యుత్సాహముతో పనిచేసిరి; ఐందవహిత సభలో కవిగారి ఎన్నికకు వచ్చిన సభ్యులు; ౧౯౨౭ లో కీర్తిశేషులైరి; మేలుపాక.

లాజరస్సు దొరగారు.

మిషనుస్కూలు ప్రిన్సిపాలు; మేనేజరు; పాఠశాల ప్రాణ

ముగ చూచుకొని, విద్యార్థుల మేలు కోరి, పాటుపడిన విద్యాభిమాని; ౧౯౧౭ ఫిబ్రవరిలో స్వర్గస్థులైరి; విశాఖపట్టణము.

వసంతరావు బుచ్చిసుందరరావుగారు, బి. ఏ., బి. ఎల్.

రావాడఎస్టేటు ప్రొప్రైటరు; దేశభక్తులు; విశాఖపట్టణము.

విన్నకోట జగన్నాథగుప్తగారు.

వర్తకులు; దేశారాధకులు; విశాఖపట్టణము.

విన్నకోట అప్పలనరసింహులు సెట్టిగారు.

శ్రీ శారదాముకుట ముద్రాక్షరశాలాధిపతి; కవిగారి బాల్యమిత్రులు; ౧౯౧౪ లో స్వర్గస్థులైరి; విశాఖపట్టణము.

వేపా భీమశంకరముగారు.

దేశారాధకులు; నిమ్న జాత్యుద్ధరణముకొఱకు జీవితము ధారపోసిన సంస్కర్త; చోడవరము.

శ్రీ రాజా విక్రమదేవవర్మ గారు.

పండితకవులు; కవిగారి బాల్యమిత్రులు; ఇపుడు జయపుర సంస్థానాధీశ్వరులు.

సత్తారు సాహెబుగారు.

ఉర్దూ, పార్సీ, అరబ్బీ భాషలు తెలిసిన మున్షి; కీర్తిశేషులు; విశాఖపట్టణము.

సబ్నవీసు సత్యకేశవరావుగారు.

కవి; దేశారాధకులు; విశాఖపట్టణము.

సెట్టి లక్ష్మీనరసింహముగారు. బి.ఏ, ఎల్.టి.

కవి; న్యాయవాది; కవిగారి బాల్యస్నేహితులలో ఒకరు; ఇపుడు జయపురాధీశ్వరుల ఆంతరంగిక కార్యదర్శి; విశాఖపట్టణము- జయపురము.

---

కవిగారి

# కొన్ని ఎన్నిక పద్యములు

ఉ. అల్ల దెచూడు మాదొర మహాప్రియ మొప్పఁగ నైజపాణియున్
పల్లవపాణి పాణి తొడపైఁ పెనఁగన్ కుడికేల్ భుజంబుపై
మెల్లగ మోప, ఆకలికి మించు-అపాంగ విలోకనంబులన్
పల్లవుఁ చూచి నవ్వు; స్మరవశ్యము కాముకవార మిమ్మహిన్.

ఉ. కొప్పు తురాయిమై మెఱయ, గుబ్బచనుంగవ పైకి కానరా,
ఒప్పుగ బట్టకట్టి, వ్యజనోచిత దక్షిణపాణి కాలిపై
మెప్పుగ తాల్చి, జాణ తను మెచ్చుచు నవ్వెడు కోడెగానితో
ఒప్పులు కుల్క నున్నది సుఖోదధిఁ మారుని వారణం బనన్.

చ. వనజ కుడుంగమధ్యమున వాసముచేయు రథాంగ యుగ్మమో!
అన సుమగుచ్ఛ భూషితములై కుచముల్ తగ, వన్నెకానికై
మనసున నెంచుచుండఁ కుసుమాయుధ ప్రేరితుఁడై విటుండు మె
ల్లన చనుదెంచి వెన్కను విలాసినిఁ తాఁకిన, నవ్వె జారయున్.

చ. శుకతురగాధిరోహకుని సూనశరార్చులఁ వేఁగి, దంపతుల్
చికిలి మెఱుంగు చేలములు చెన్నుగ తాల్చి, రసాయనంబు కొం
చక చషకాలిఁ గ్రోలి, కడు చాతురి నాథుఁడు 'బేంజు' మీట,త
త్తకతక ధింధిమిం ధిమి సుతాళ వితాన సమానమానతన్,
చకచక చంచలాకృతిని చాన నటించెడి పాటవంబునన్.

శా. సంకేతంబున నుండ రాధ, యదువంశాధీశ్వరుం డంత ని
శ్శంక న్వెన్కనుచేరి మూయఁ కనులన్, శ్యామాంగి మోమెత్తి ఏ
సంకోచంబును లేక కృష్ణపయికేల్ చాఁపన్-విడెన్ కొప్పు; మీ
నాంకానీక శుభాంక వైఖరి పడెన్ త్యాగంబునన్ పైఁటయున్.

మ. కుహనాతాపసవేషధారి నరుఁ డా గుచ్ఛస్తనిన్ కామినిన్
గ్రహరాజాననఁ నీలమేఘ చికురన్ రాజీవగంధిన్ కనన్,
సహనం బేది సుభద్ర భద్రగజరాట్సద్యాన కేల్పట్టి తా
రహిఁగౌఁగింటఁకదింప మోహవశతన్ రంజిల్లిమోడ్చెన్ కనుల్.

శా. లీలామానుష విగ్రహుండు, మురళీ లీలాను రక్తుండు, గో
పాలుం డంగజ శాత బాణ హతుఁడై, ప్రౌఢాంగనన్ రాధికన్
లోలాత్ముండయి చేరి, సవ్యకరమున్ లోలాక్షి వామాక్షిపై
లీలాలోలత మోపి నంతనె, బలే! లేఁబ్రాయపుం జేష్టలం
చోలిక్ కృష్ణునిఁ బట్టఁ కంకణ రవంబొప్పంగ కేల్చాఁప, ఆ
రోలంబాలక కేశపాశము విడెన్; రోమాంచ మయ్యెన్; వెసన్
వాలాయంబుగిఁ పైఁట జాఱి పడినన్, వక్షోజముల్ రైకలో
జాలం బేది కరంబు తా ముబికె; హా! చర్చింప యత్నంబులే
లా? లీలాపురుషుండు కోరఁ అనుకూలం బౌచు, కార్యంబగుక్.

చ. ఒక వగలాడి డెందమున నొందుచునున్న అమంద హర్షమాఁ
గక వెలికుబ్బఁ, క్రమ్ముటకు కొంచుఁడు రాజు నటించు తోడివా
రికి ఒనరంగ చెప్పుచు, చరించెను మించి చలించుచూపులన్.
రకమగు పైఁటజార్పుల, తిరంబుగ నిల్వని కాలు సేతులన్,

ఉ. ముద్దియ మోర్తురా కొమరుముద్దులుకుల్కెడుమోముచూచితాక్
అద్దిర! యంచు మెచ్చి, ఇది అందని పండున కఱ్ఱు చాఁచు లే
వ ద్దితనిన్ కనంగ నని పద్దుగ మోమర త్రిప్పి, అప్పుడే
తద్దయు వాని చూచి ఒక దాఁటిడె లోనికి, కంతుఁడెంతయున్
బ్రద్దలు చేయ బొమ్మ శితబాణ చయమ్ముల, ఓర్వలేక నాన్.

చ. తనదెస చూచుభర్తఁగని, తానొక-అంజయె వెన్కఁ బెట్టి, వెం
టనె అది ముందువేయుచు, కడానిపసిండిమెఱుంగు చెక్కుల

ల్లన దివటీ వెలుంగునఁ జెలంగ, కనుంగవమించు మించఁ, వీ
డిన ముడి దిద్ద పైఁటయు వడిన్ పడ, చన్నవ ఉబ్బఁ, చంటిపా
పనుమఱుఁగుంచిచూచె నృపుఁ భామిని, కాముని దాడికోడుచున్.

గీ. ఎటకు నడికేయి కటికి చీఁకటిని పోదు?
ఎందు మదివచ్చు వరుఁ డుండు, అందులకును;
వెఱపు లే దటె? ఒక్కతె వరుగు దిట్టు!
ఎక్కు విల్వాని కలఁడు నా పక్క మరుఁడు.

ఉ. సుందరికిం దలంపఁ పతిచొక్కపుఁ దంగటి జున్ను; కొంగునన్
చెందు పసిండి ముద్ద; కడు చెంగట నుండెడు వేల్పుగిడ్డి; దొ
డ్డిం దగియుండు కల్పకము; డెందమునంగల కోర్కెతీర్చి, ఆ
నందము చేయు దేవుఁడు; ఘనంబుగ అతని కొల్వఁడీ సతుల్!.

దాటువులు.

చ. కలిగెను భేద మొక్క టిదె కామినిరో! నిఱుపేదనైతి; నీ
వలపది మొన్న నా యెడఁద వాకిట నెప్పుడు పాఱు నేఱుగా
మెలఁగెను; పాఱె నిక్క మది మించిన వేడుక హద్దు లేకయే
వలనుగ నాదు కోరికకు వాసిగ; హా! అపు డెన్నిసారులో
చలమున సౌఖ్యలిప్తలను చాలఁగ నెంచితి; భోగవార్ధిలో
పలనె మునింగి తేలఁగను ప్రాణము, హాయిగ నుంటి; ఇష్ట స
ల్లలితముగాఁగ ఒక్కయెడ లావుగఁ జేరి, కరంబు శ్రావ్యమౌ
కలకలకంఠ కంఠ మృదుకాకలి నాద సమాన మాధురిన్
చెలఁగుచు ఎంతయున్ మనసు చెన్నలరారఁగ చేయు కాంతితో
తలకొను నట్టి పేశల నితాంత మనోహర సారధారణో
చ్ఛలిత విలాస భావయుత జంగమ రాగము మా, అచెద్ది తా
నిలిచెనొ! నేను చెప్పఁగలనే కలనే కలనే? అయో! విధీ!
సలలిత సౌఖ్యహీన పటుసాంద్ర తృణావృతకూప; మయ్యయో!

వలపులబావి లోఁతగుచు వచ్చును మాటికి; ఇంకి పోదుపో
కలిగెడు లాభమెద్ది మదిఁ గాంచఁగ ? చప్పుడు లేక ఏరికిన్
తెలియని పాడు నూతఁబడి త్రెళ్లెడు నీ రది నాలు కెండఁగా,
బల మతి ఎంతొ డస్సి దగఁ బాపుకొనం జను బాటసారికిన్
ఫల మొక యింత చేయునొకొ! బాపురె! ఇప్పుడు నట్టిభేదమే
బలితపు నాదు డెందపు కవాటము ముంగిటఁ చేరి, అక్కటా !
కలను తలంపనట్టి ఘన గర్భదరిద్రుని చేసెఁ ఈసునన్.

అనురాగ భేదము.

ఉ. గాండివ ముక్త సాయక నికాయ మహోరగనాథవార ము
ద్దండ భయంకరంబయి, మదంబున త్రుళ్ళెడు శత్రువర్గ దో
ర్దండపరాక్రమం బడఁచి, తప్పక వారల ప్రాణవాయువుల్
చండతరంబుగాఁగ ఒకసారియె క్రోలఁగఁ జేయలే నొకో !.

చ. అకటకటా ! అనేక వసుధాధిపకాంతలు సేవసేయ- మా
క్తిక కమనీయ హార పరిదీపిత కాంచన హంసతూలికా
ప్రకట విలాస తల్పమున పండెడు కామిని, నేఁడు కానలో
ఒకతె కరంబు కష్టములఁ ఒందుచు నున్నది కృష్ణ, దైవమా !.

కిరాతార్జునీయము.

ఉ. సారసకైరవ ప్రకర సార మనోహర సౌరభంబు, వి
స్ఫార పటీర సార ఘనసార తుషారజ నీర శైత్య, మిం
పారఁగ కొన్నఁగా ఒసఁగి- అల్లన తుమ్మెదమ్రోఁత పల్కులన్,
కూరిమియవ్వ పంపె నని గొబ్బున రమ్మని పిల్చె నెచ్చెలీ !.

చ. విడె మొనరించు నేరుపున వింతగ నవ్వెడి తీరు, పెన్కురుల్
చిడిముడి నాదు వ్రేళ్ళ తుదఁ చిక్కడలించెడి సౌరు, పెన్నెదన్
విడివడు పైఁట మాటుకొను నీటు, వెలుంగు బెడంగు కన్గవన్
కుడి యెడమల్ కనుంగొనెడి గోఁటు, జయింప వొకో జితేం
ద్రియున్ ?.

క. ఘన విద్యుచ్ఛక్తిని పా
వన జల జీవానిలములు పాయుచు, మఱి తా
మెనయవె వేఁడిమి? అటులే
మనమును కలియుదుము మోహ మహితోష్ణతచే.

గీ. మేని-అచ్చు నాది; దాని చాయయె నీది;
మోము నాది; దాని గోము నీది;
కురుల పెంపు నాది; కురుల బాగో నీది;
ముక్కు నాది; దాని టెక్కు నీది.

శా. అయ్యో! ఏమిది! పుష్టిభోజనపుపాత్రా! పాములా హారముల్!
దయ్యాలా నిను కొల్చు సేవకులు! నీదారిద్ర్య మింతెక్కువా?
కుయ్యో! అంచును నీకు మ్రొక్కిలిడు భక్తుల్, బుద్ధిమంతుల్ సుమీ;
అయ్యా! గోఁచియు లేదె నీ? కకట! ద్రాక్షారామ భీమేశ్వరా!.

ఉ. బంగరు మేడపై నిలిచి-భావమునం గల మోహవార్ధి ఉ
ప్పొంగినమాడ్కి-బాష్పజలముల్ ప్రవహింపఁగ-నేనువచ్చుత్రో
వం గనుగొంచు, అట్టె నిలువంబడి మ్రాన్పడి యున్న యట్టి చి
త్రాంగద, కంటఁగట్టిన విధంబున తోఁచుఁగదా విశారదా!.

శా. తన్నేన్ వీడ్కొనఁ బోవలేచి,ఎదురై,తాంబూలమందిచ్చి,కన్
సన్నన్ చేటులఁ బంప,పోయి-మరలన్ వత్తున్ చుమా పంపుమా
అన్నన్, వెన్కకుఁ దగ్గఁ, ఏమి? యని నే నాశ్లేషముంజేయఁగా
నన్నొక్కగ్తైను వీడిపోవఁదలఁపన్ న్యాయంబె? అంచార్తితో
కన్నీ రేఱులుగాఁగఁ పాఱ,పొగలెన్ కంజాక్షి మిత్రోత్తమా!.

క. కలికీ! అచ్చర నవలా
కొలికీ! కాముకుల గెలువఁ కుదురగు మరు చే

ములికీ! ఇప్పటికిని లో
పలి కీలక మెఱుఁగ నీకు పొల్పడ లేదా?.

చ. ఇటునటు కట్టుకొంగుసవరించు నెడన్ మెడకొంత వంచి, వాల్
జట కనఁ జేయుచో పయఁట జార్చి, బెడంగుగ అద్ది దిద్దు చొ
క్కాట మెయి విర్చి, బల్బిగి జగాజిగి పేరెద యంటఁ చేతు లు
త్కాటముగ అడ్డు పెట్టి, కడఁగంటను చూచుచు నిల్చినట్టి ఆ
కుటిలశిరోజ నీటుఁ, నగు గోఁటుఁ బలా! మఱవంగ నేర్తునే?.

సీ. నీల మేఘశ్యామ! నీదయచేతను
కలికి పెన్నెఱి కొప్పు కాంచినాఁడ;
చంద్రాభ కీర్తి! నిన్ శరణు వేఁడుటఁ జేసి,
సుదతి ముద్దుల మోము చూచినాఁడ;
క్షీరాబ్ధిశయన! నీ చేత లెంచుటచేత,
వనిత తియ్యని నుడుల్ వినినవాఁడ;
నగధర! నీ నేర్పు పొగడు చుంటిని కాన,
కలికి పెన్నెద సొంపు కనినవాఁడ;

గీ. కనకచేల! నీదు కాళ్ళు తాఁకుటచేత,
కొంత కొంగు తాఁకఁ కలిగినాఁడ;
ఇంక నిన్ను నాదు హృదిఁ చేర్చి నందుల,
కింతి చేర్పు; మ్రొక్కు లిడెడివాఁడ.

క. తల వంచుకొనుచు- ఇటు లో
వెలఁదీ! నీవుంటఁ, మబ్బువేసినఁ తాపం
బలముకొను నట్టు లయ్యెడు;
తల యెత్తి, కటాక్ష సుధను తడుపంగదవే.

విజయవిలాసము.

ఉ. అమ్మకచెల్ల! తెమ్మెర నయమ్మున మల్లెలఁ జాజిపువ్వులన్
కమ్మని తేకు సంపఁగులఁ క్రమ్మెడు తావులు సంగ్రహించి, మో

దమ్మున వానిఁ జిమ్ము మన దగ్గఱ; దాతల చంద మిట్టిదే;
నెమ్మదిఁ అర్థు లీ విధము నేర్చి చరింప సుఖమ్ము లబ్బెడున్.

గీ. కుండ పోలికఁ ఆకాశ ముండు; అందు
చల్ల యను మాడ్కి వెన్నెల ఉల్లసిల్లు;
వెన్న ముద్దన చంద్రుండు చెన్ను మీఱు;
తొఱక లనఁగను చుక్కలు మెఱయుచుండు.

రమావతీవిలాసము.

చ. లలిత రసాలసాల మృదులప్రథ తోరణ పల్లవావళుల్
కలకలకంఠ కామినులు కంఠము దాఁకను మెక్కి చక్కగా
పలికెడు కాకలీ ధ్వనులు; బంధుర గంధ సమీరపోతముల్
పాలఁతులఁ చేర్చు నాయకులఁ, పొందునకేగఁగఁ ద్రోవ మాపుచున్.

ఉ. ఈ లలనాశిరోమణి అహీన గుణావళిఁ కట్టి ఈడ్వఁగా,
జాలము సేయఁ జాలకయె చయ్యన దిగ్విజయంబు పేరు కాఁ
జాలఁగ వచ్చినాఁడ; ఇఁక జవ్వని చక్కఁగవిల్తు తూపులన్
తేలఁగఁ జేయునో! సుఖనదీ లహరీతతిఁ తేలఁ జేయునో!.

గీ. పలుకు లల చిన్నివూఁదేనె పలుకులవలె
అమృత మొలుకుచు నున్నవి; అయిన హృదయ
రంగమో పదు నిడిన పిరంగి-ఉక్కు
కన్న బెడిదంబుగా తోఁచు చున్న దకట !.

చ. స్థలకమలాసవం బెపుడు చాలఁగఁ గ్రోలుచుసొక్కుభృంగ, మా
సలలిత పుష్పమున్ గెలువఁజాలిన నీ వదనామృతంబు దొం
గిల మది నెంచి వచ్చి, ఇదె! గిఱ్ఱున పాఱెడు నీవు చూడ; చం
చలనయనంబులన్ కనిరొ! సంపఁగిపోలినముక్కు చూచిరో !.

సావిత్రివిజయము.

ఆ. వంగి యుండు మనిన వంగి యుండవలయు;
కూరుచుండు మనిన కూరుచుండ

వలయు; నిలువు మనిన నిలువఁగా వలయును;
వలదు దాస్యము పగవారి కైన.

కుమారాస్త్రవిద్యాసందర్శనము.

మ. అలకాశృంఖలపాళిఁ గట్టి, భృకుటి వ్యావృత్తి కోదండ స
ల్లలితోగ్రాంబకపాళిఁ గొట్టి, వెనుకన్ లాలిత్య మందస్మిత
చ్ఛల మొప్పారఁగ మత్తు చల్లి, ఎరగాఁ జన్దోయి బంగారు కుం
డలు చూపెట్టినఁ ఏరు లోఁబడక యుండంజాలువా రీ ధరన్?.

భీమవిజయము.

గీ. పసితనమునందు పొత్తిళ్ళ పండు నపుడు,
ముదిమిఁ గాటికి కాల్చాఁచి- మూల్గు నపుడు,
కాచి ప్రోవఁగ అఁడుది కలుగ కున్న,
మనుజునకు వేఱు దిక్కుఁక మహిని గలదె?.

ఇంగ్లీషునుండి.

ఉ. పూవుల బంతినుండి ఒకపువ్వు విడంబడి తాఁకి నంత నే
జేవురు రీతిఁ గందు కడు చెల్వగు నీ మృదుదేహ, మిప్పు డీ
పావక కీలలందుఁ పడి-బంగరు బొమ్మవలెన్ కరంగ, నీ
వేవగఁ వాని బాధల సహింపఁగఁ జాలెదు దాన వక్కటా!.

కన్యకాంబికావిజయము.

గీ. అమిత వారిధిపైఁ తిరుగాడుచుండి,
దాని కెరటంబులను - మెల్లగాను పోవు -
ఓడ తెరచాఁపలను - వీచుచుండు గాలి,
అద్భుతావహ మగు వస్తు వనఁగ రాదె?
అది వినీల తరంగ సముదయములను
నురుఁగుగా చుట్ట లిడు; అది కరము బలిమి
కలుగు - ఓడకొయ్యను తునుకలుగఁ జేయు;
మఱి తుపా నడంగిన వెన్క మసలి సురుఁగు.

అయిన, అది దివసాంతంబులందు, దయను,
ముడిచికొనిపోవు మేల్తావి పూవు గమికి
తా నిశాస్వాగతము చెప్పదాని వలెనె,
ఎంతొ మెల్లగఁ పొదరిండ్లఁ ఏగుదెంచు ;
అది గులాబి తావిని తాల్చు ; అది పురుగుల
రెక్కలు కదల్చు ; నాతోడ ఎక్కడైన
చుట్టుచుట్టుగఁ తిరిగాడు ; ఎట్టులైన
కంటఁ బడనట్టి వస్తువు కాద అద్ది!.

గాలి.

ఉ. ఎక్కువ శ్రద్ధ చేసి-మది కెక్కెడు చక్కని తేట మాటలన్,
చొక్కపు పద్దెపున్ కవితసొంపును పెంపును కాంచుసత్కథన్,
పెక్కు రసంబు లుట్టిపడ వేడుకఁ వ్రాసిన కావ్య మబ్బుచో,
ఎక్కడ నేన్ రసజ్ఞు లెదఁ హెచ్చుగఁ చొక్కక వెక్కిరింతురా ?.

ఆంధ్రకథాసరిత్సాగరము.

చ. కలధన మెల్ల పోయిన, జగద్విదితంబగు రాజ్య మూడినన్,
కుడువఁగ కూడు-కట్టుటకు కోకయు లేని అభాగ్య మబ్బినన్,
పలుకడగండ్లఁ చిక్కినను, భార్యను పుత్రుని పాయ వచ్చినన్,
నిలుకడ కల్గి-సత్యతను నిల్పుకొనన్ వలె పూరుషుం డిలన్.

మ. ధరణీనాథ వరేణ్యుఁ, డార్తజన సంతానావనుం, డంబికా
వర పాదాంబుజ సక్తచిత్తుఁ,డమలవ్యాపారుఁ, డార్యప్రియుం,
డరిరాడ్వార వనీ దవానలుఁ, డవార్య ప్రాభవాఢ్యుండు, భా
స్వర సత్యవ్రతుఁ, డానరేంద్రుఁడు, హరిశ్చంద్రావనీశుండునూ.

చ. కడు పొడుగైన మేడపయి క్రాలుచు నుండియు-తప్పటడ్గుచే,
పుడమిని కూలువాని గతిఁ, బుద్ధిగలాఁడును తప్పి-మూఢుఁడౌ;

పుడమిని సోలుచున్ పడెడుపుర్వును టెక్కలు వచ్చి-మేడకున్
వడినెగురంగఁ జాలునటు, పామరుఁడొక్కటఁబుద్ధిమంతుడో.

గీ. మాలపల్లెలోన మానవు లుండ రా?
సర్వమందు నిండి, సర్వశక్తి
అయిన దేవుఁ డుండఁ డా? అచటికి ఏల
ఏగ రాదో! నాకు ఎఱుఁగ రాదు!.

ధీరవారిశ్చంద్రము.

గీ. క్షితిపు మాటకు ఎదురుగాఁ జెప్పఁ జనుట,
తనదు గోతిని తాఁ దీసికొనఁ గడఁగుట;
రాజు పగటిని కనుఁగొని రాత్రి యనిన,
నెల ఇదిగో! చుక్క లివె! యని పలుక వలయు.

గీ. తెలివి గలవారికే సొమ్ము కలిగె నేని,
తెలివి తక్కువవాం డ్రెంతో నలిఁగి యుంద్రు;
కాని, మేధావు లబ్బంబు కనెడు రీతిఁ
ఈశ్వరుఁడు మూఢులకు ధన మిచ్చు; అహహ!.

గీ. భక్తివేషంబు తగఁ గొనవచ్చు నేని,
అతఁడు భక్తుఁడుఁ, మంచివాఁ డనుకొనఁ దగు;
ఏల యన లోనఁ గల దేదో! ఎట్లు తెలియు?
ఏమి పని ఉండు అధికారి కింటిలోన?.

గీ. ధనికు నెదుటఁ జేతులు కట్టుకొని నిలుచుట
కంటె, ఉడుకు సున్నపు పని కరము మేలు;
తిండి పోతులు! ముద్దచే తృప్తి కనిన,
పొట్టకై పరుకాళ్ళపైఁ బెట్టరు తల.

పూలతోఁట (గులిస్థాన్)

గీ. ప్రతిదినమునందు చక్కగా పాలొసంగు-
ఆవునుం బలె, సత్కర్మ మాచరింపఁ

ప్రోత్సహించెదు-ఇంద్ర! ఓ పుణ్యమూర్తి!
భక్తియుక్తులమై పిల్చు-వార మిదిగో!.

గీ. కవులుఁ, ఉపకారులును, నలుగడల నుండు
వారు, మిత్రావరుణులు కృపారసంబు
మా పయిన్ కురియించుచు, మా బలమును
సత్క్రియను కాచుచున్నారు సంతతంబు.

ఋగ్వేద సంహిత.

చ. ప్రకృతి-చరాచరంబగు ప్రపంచము నెల్ల సృజించి పెంచుచో,
సుకృతము దుష్కృతంబు తమ సొంతపు బుద్ధిని చేయు ప్రాణిపా
ళికి సరియౌ ఫలంబులను లేశము భేదపు బుద్ధి లేక- కూ
ర్చి, కులుకు దేవుఁ, డెల్లరకు చేకురఁ జేయును గాక భద్రముల్!.

గీ. కోసినను క్షాత్ర రక్తంబు కొంచె మైన
ఎందు లేనట్టి వారలే ఇపుడు రాజు
లైన, క్షత్త్రియ రక్తంబు మేన నెల్ల
నిండు నేన్ చక్రవర్తినై నెగడు టరుదె?.

చ. తనదు శరీర సౌఖ్యములు దవ్వగు; దగ్గఱి చుట్ట పక్కముల్
గొణఁగుచు దూఱుచుండెదరు; కూరిమి భార్యయు చిన్నపుచ్చెడున్;
జనములు తెల్విలేమిఁ దగుసాయము చేయరు; దుష్టవర్గముల్
పనివడి కేళి చేయుదురు; బాపురె! దేశపు తీపి పాపమో!.

ప్రతాప చంద్రగుప్తము.

గీ. ఒడలె తా మని, దానిచే ఒదవు సుఖమె
సుఖము-అనుకొని, నిజమగు సుఖ మెఱుఁగక,
అది ఒసఁగు-ఆత్మ తత్త్వముఁ అరయఁ బోక,
జ్ఞాన ధనమును గడియింపఁగా తలఁపక,
తుచ్ఛ ధనమె ముఖ్యం బని తోఁచు కతనఁ,

దాని గొప్పయె గొప్పని తట్టు కతనఁ,
అది గడింపఁగ అన్య రాజ్యములు కొనుట
మొట్టమొదటి పనిగ పొడకట్టు కతనఁ,
ఎందఱొ అధర్మ మొనరించు చుందు రకట!
ఎవఁడొ ఒక్కఁడు చేసిన దే నెపముగ,
ఏ కొలఁది చీలి కయ్యమో ఇట్టె పుట్టు ;
నిప్పు రవ్వ మెల్లగ రాజి నెఱయు నటుల
అది పెరుఁగు; రెండువైపుల నంటి ఉండు
వారు కత్తులు నూఱుదు ; రంతఁ, కయ్య
మునకు కాల్ద్రువ్వుదురు; కోపమునను కలఁగి,
ఒడలు తెలియక, శివమెత్తి, ఒండొరులను
గిట్టి, పోరాడుదురు ; తుద ముట్టుదు ; రయొ !
కారణము దీని కంతకు కర్మ నియతి.
ఎపుడుఁ ఒకజాతి వారలే ఏపు కనరు ;
ఎల్ల జాతులు వరుసమైఁ ఎసఁగ వలయు.

మహోపద్రవతత్త్వము.

ఉ. వెన్నుని ముద్దురాణి వయి, విద్దెల కెల్లను పుట్టినిల్లవై,
మన్నన కెంతొ పాత్రమయి, మానవకోటికి పట్టుకొమ్మవై,
పున్నెపు రాశివై, సిరికిఁ భోగచయంబుల కునికిపట్టవై,
వన్నెయువాసియున్ కనిన భారతమాతరొ! నీకు మ్రొక్కెదన్.

గీ. కనుల విందు చేయఁగాఁ జాలు సౌందర్య
మిచ్చినట్టి దేవుఁ డేల ? అకట !
లోన చేఁదు ముద్దగా ఒనరించెనో !
తెలివి లేమి యనుట, తెలివి లేమి.

ముసిఁడిపండు.

క. నిక్కమె చక్కెర తేనెల
లెక్కింపనిదాన వగుట; లేదు కదా నీ
కెక్కడఁ జూచిన పైడా?
బక్కతమున నిన్నుఁ జేర రకట! సపోటా!.

సపోటా.

ఉ. అంతకు తృప్తి లేదె? బళి! ఆకస మంతయు నేఁడు క్రమ్మినా;
వెంతటి దొడ్డకార్య మొనరింపఁగ ఎంచితొ! చాలు; దన్నినా;
వింతట విశ్రమింపఁ దగు ఎచ్చటనో ఒకమూలఁ; ఇచ్చటన్
గంతులు వేయఁబోకుము; మొగంబున తేటతొలంగు మేఘమా!.

గీ. గగన కోశంబు- సాంధ్యరాగంబు వహ్నిఁ
గాల, పైకొను పొగవలె కఱి మొయిళ్ళు
గ్రాల, సిత పీత రేఖలు రజత కనక
ములు కరఁగి పాఱు నీరునాఁ బోలుపు మీఱు.

ఉ. కాలపు గారడీఁడు, తొలుకారు దినంబున తొంటి సంజయా
వేళను- తూర్పు దిక్కునను విన్నులు వ్రాలిన చో, జగాజిగిన్
గ్రాలు గులాబి కెంబసుపు కావి మొదల్ గల మేలి రంగులన్,
నీలపు రంగుపై వెలయు నింగి చెలంగుచు నుండ-మబ్బుచాల్
వాలిక లాచు, క్రొంబసిఁడి పాలిక లాచు, బెడంగు కాలివాల్
పోలిక లాచు * * * *

గీ. పచ్చ మొకములు ముక్కుపై పక్కఁ వెలయు-
ఎఱ్ఱ మొఖములు బంతులా యేమి? అనఁగ,
కానవచ్చును హేమంత కాలమందు
పట్టు తప్పి పడిన మఱ్ఱిపండ్ల పిందు.

దాటువులు.

గీ. ఉల్లమున కీడు చేయ రోయుచును పైకి
చిఱునగవు నవ్వుచుండును చెట్ట; అట్టి
చెట్టఁ బెద్దలు 'పైపాల చేఁదు కుండ'
అనిరి; వానిని నమ్మఁగా చనదు రామ!.

గీ. పాలు పోసి ఎంత బాగుగా పెంచినన్,
పాము కోఱచేఁదు పాయ దింత;
చెనఁటి వాని కెంత చెప్పి నేర్పిన, వాని
యెడఁద చేఁ దొకింత విడదు రామ!.

గీ. తప్పుచేసి దాని కప్పఁ జూచెడు వాఁడు
తప్పు లెన్నొ చేసి తాను చెడును;
తనదు తప్పుఁ ఒప్పుకొనుట కడున్ మేలు;
అయిన, అటులు చేయు టరిది రామ!.

క. అలఁతి జగం బెల్లను పే
తలక్రిందుగ చేయుదు నని తలఁచుచు, తుదకున్
కల బలిమి యెల్ల చూపియు
నలుసంత కదల్పు లేక నవయున్ రామా!.

గీ. నిన్ను కొలుచుచు నమ్ముచో, తన్నుఁ గూర్చి
తెలివి కలవాఁడు తలపోయ కెలమి నుండు;
ఎన్న తా నెంత? తన పస ఎంత? అంత
యును సలుపు బర్వు తాల్చు నీ వుండ, రామ!.

గీ. పైకి 'ఆమోర పులి'వలె బాగుగాను
కాన వచ్చుచు, డబ్బాటుగా కరంబు
గోరములు చేయు చుందురు కూళ లెందు;
కాన, మానిసి-అరయిక కడిఁది రామ!.

గీ. తనకు మేలు కలుగు తఱిఁ ద్రాఁచుఁ ద్రొక్కినన్,
కాటు పడక పోవఁగలుగు; కాని
ఎదురు రాఁగ నున్న యెడల, దారిని చనన్
ఊఱక వచ్చి గొఱ్ఱై కఱచు రామ!.

గీ. బలిమి లేని వాఁడె పలువరై బింకము
లాడు చుండును తర మరయ లేక;
కనఁగ చిన్న దయ్యు కడు రొద కావించి,
కలఁచు కీఁచువాయి కరణిఁ రామ!.

గీ. కాచు కొనుటకు తన మేను దాఁచు కొనుటఁ,
దొంగ! పచ్చి దొంగ! అను బెడంగు బిరుదు
అలిచే కొంచఁ జాలెడి-అతని మేను
మేలుపనులకు పనికి రాఁజాలు రామ!.

గీ. అప్పు గాసి పాసి, ఎప్పుడున్ డెందము
నిమ్మళముగ చెలఁగు నెమ్మి యిమ్ము;
నాటిపలుకు కొలువు, నాటికొల్వును చేయు
నెమ్మి యిమ్ము; నెమ్మి యిమ్ము! రామ !

శ్రీరామశతకము.

క. నుడితీర్పులు, నుడిదండలు,
నుడికూర్పులు, పలువు రెన్నొ నుడివిరి; అయినన్
కడుదిట్టపు టడిమట్టపు
నిడుగద్దెను తెనుఁగు తల్లిఁ నిలుపర ఎవరున్.

తెనుఁగు.